శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః

    

# శ్రీకూరేశవిజయము



శ్రీ కూరేశులు




'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అప్పాగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

## శ్రీమతే రామానుజాయ నమః

## విజ్ఞాపనమ్

★★★★★

భగవద్రామానుజులు విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయ ప్రచారధురంధరులుగా వేంచేసి ఉన్న కాలంలో, ఆ సమయంలో, ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న చోళప్రభువు శైవమతంలో దురభిమానాన్ని కలిగినవాడు అందువల్ల, సహజంగానే క్రూరమైన స్వభావం కలిగినవాడు అయినందువల్ల, ఏ విధంగా అయినా సరే, శ్రీరామానుజులవారిచేత "శివుని కంటే పరతత్వం వేరొకటి లేదు" అని సభలో అందరి ముందు వారిచే బలవంతంగా అయినా అంగీకరింపజేయాలని ఆ విధంగా వారిచే పత్రంలో వ్రాయించి, సంతకం చేయించుకోవాలని అభిప్రాయపడి, తన భటులను శ్రీరామానుజలను తన సభకు తీసుకొని రావలసినదిగా ఆజ్ఞాపించాడు. అతని ఆజ్ఞ ప్రకారం రాజభటులు రామానుజులను తీసుకొని వెళ్లడం కోసం వారి ఆశ్రమానికి వచ్చారు. అప్పటికి శ్రీరామానుజులు ఆశ్రమంలో లేరు.

ఈ సంగతిని తెలుసుకున్న వారి ముఖ్య శిష్యులలో ఒకరైన కూరేశులు, దుష్టుడైన ఆ చోళప్రభువు కారణంగా శ్రీరామానుజులకు సంభవించబోయే ఆపదను గుర్తించి, శ్రీరామానుజులవలె, దండ కాషాయాలను ధరించి, తామే రామానుజులమని చెప్పి, రాజభటులతో పాటు రాజసభకు బయలుదేరి వెళ్లారు. వారికి సహాయంగా పెరియనంబి వారితో పాటు వెళ్లారు. ఈ విధంగా జరిగిన సంగతి ఏమీ శ్రీరామానుజులకు తెలియదు.

కూరేశులు రాజసభకు వెళ్లగా, చోళప్రభువు కూరేశులనే రామానుజులు అని భావించి, తాను అనుకున్న విధంగా " శివాత్ పరతరం నాస్తి" అని పత్రంలో రాసి, తాము దానికి అంగీకరిస్తున్నట్లుగా సంతకం పెట్టమని కూరేశులను ఆదేశించాడు. కానీ, కూరేశులు, ఆ సభలో పండితులు అందరి ముందు, వేదస్మృతీతిహాస పురాణాది పలు

గ్రంథాలనుండి ఎన్నో ప్రమాణాలను చూపిస్తూ, ఆ ప్రభువు అనుకున్నట్లుగా శివుడు పరతత్వం  కాదని, శ్రీమన్నారాయణుడే పరతత్వమని సుస్పష్టంగా నిరూపించారు.

ఆ విధంగా కూరేశులు చోళరాజు సభలో వాదించిన వాదాల వివరాన్ని, అప్పుడు వారు చూపిన ప్రమాణాల వివరాన్ని తెలియజేస్తూ, అనంతర కాలంలోని విద్వాంసులు ఒకరు కూరేశ విజయం అనే పేరుతో శ్లోకరూపంగా ఉండే ఒక గ్రంథాన్ని రచించారు. దానికి, తరువాత కాలానికి చెందినవారు ధర్మాచార్యులవారనే  పండితులు ఒకరు, పలు ప్రమాణాలను వేదేతిహాస పురాణాలనుండి ప్రస్తావించి, సంస్కృతంలో ఒక వ్యాఖ్యానాన్ని రచించారు. ఈ రెండు చాలా కాలం క్రితమే తెలుగు, సంస్కృతలిపులలో ముద్రింపబడ్డాయి.

ఈ మధ్యకాలంలో, ఈ కూరేశవిజయగ్రంథం సంస్కృతవ్యాఖ్యానంతో పాటుగా, సుప్రసిద్ధ ఉభయ వేదాంత విద్వాంసులు, సంగీత సాహిత్య కళానిధి, శ్రీమాన్ న. చ. కృష్ణమాచార్యస్వామివారు రచించిన తెలుగు వివరణతో, సత్సంప్రదాయ పరిషత్, వరంగల్ ద్వారా, మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శ్రీమాన్ శ్రీ.న. చ. రఘునాథాచార్యస్వామివారు ముద్రించారు.

ఈ కూరేశవిజయానికి కల సంస్కృతవ్యాఖ్యానాన్ని అనుసరించి, మరికొన్ని ద్రావిడప్రబంధసూక్తులను కూడా కలుపుకొని, ద్రావిడభాషలో, తేశూర్ నల్లాన్ చక్రవర్తి శ్రీవత్సాంకాచార్యస్వామివారు ఒక  వివరణను అనుగ్రహించారు. ఆ వివరణకు అనువాదరూపమే ప్రస్తుతగ్రంథం.

ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో సహకరించిన మిత్రులు, శ్రీమాన్ వంగల కేశవ అయ్యంగార్ స్వామివారికి అనేక మంగళాశాసనాలు. స్వస్తి.

★★★★★

భాగవత దాసుడు,

ఈ ఏ శింగరాచార్యులు

# విషయసూచిక

# శ్రీకూరేశవిజయము

★★★★

భగవద్రామానుజుల కాలంలో చోళరాజ్యాన్ని పరిపాలించిన రాజు (ఇతనికి సంప్రదాయంలో క్రిమికంఠచోళుడు అని, అవ్యపదేశ్యుడు అని పేరు.) శైవుడు అయినందువల్ల శైవాగమాన్ని మాత్రమే నమ్మి, తాను తన పురోహితుడు తన దేశంలో ఉండే విద్వాంసులను అందరినీ పిలచి, " శివాత్ పరతరం నాస్తి" – శివునికంటే పరతత్త్వం ఇంకొకటి లేదు – అని వారిచే వ్రాయించి, వారి దగ్గర సంతకం చేయించుకొవాలని వారిని నిర్బంధించగా, కొందరు అతని ఆజ్ఞకు భయపడి, మరి కొందరు ధనం, క్షేత్రం, మొదలైనవాటికి ఆశపడి, వారు చెప్పినట్లుగా వ్రాసి సంతకం చేసి ఇచ్చారు. ఈ విషయాన్ని గమనించిన నాలూరాన్ అనేవాడు " వీరందరూ అల్పులు. వీరు వ్రాసి సంతకం చేస్తే ఏమి? చేయకపోతే ఏమి? రామానుజులు కూరేశులు వ్రాసి, సంతకం చేస్తేకదా దీనికి విలువ ఉంటుంది" అని రాజును ప్రేరేపించి, " రామానుజులను సభకు తీసుకుని రమ్మని మీ పరిచారకులకు చెప్పండి" అని ప్రోత్సహించాడు. చోళప్రభువుకూడా ఆ విధంగానే తన పరిచారకులను ఆజ్ఞాపించాడు. ఈ వార్తను విన్న కూరేశులు రామానుజుల త్రిదండ కాషాయాలను తామే ధరించి, చోళరాజు సభకు వెళ్లడానికి సిద్ధపడ్డారు. దీనిని గుర్తించిన పెరియనంబి కూడా కూరేశుల వెంట చోళరాజసభకు వెళ్లారు. వీరిద్దరూ చోళరాజసభను చేరి, "శివాత్ పరతరం నాస్తి "అనే వాక్యాన్ని పరిహాసం చేస్తూ, "ద్రోణమస్తి తతః పరమ్" అనే ఇంకొక వాక్యాన్ని సమాధానంగా వ్రాయడమే కాక, శైవులు చేసే దూషణాలను అన్నిటిని ఆ సభలో ఖండించి, శ్రీమన్నారాయణుడే పరాత్పరుడు అన సిద్ధాంతాన్ని స్థాపించారు ఈ విషయాన్ని కూరేశ విజయం అనే గ్రంథం

మనకు తెలుపుతున్నది. ఈ గ్రంథం, శ్రీపెరుంబూదూరులో ప్రతి ఏడూ జరిగే భగవద్రామానుజుల అవతారోత్సవాలలో ఆరవ నాడు శ్రీరామానుజుల అర్చామూర్తి ముందు అనుసంధింపబడుతున్నది. ఈ దివ్యదేశసంప్రదాయ క్రమాన్ని అనుసరించి, ఆంధ్రదేశంలో అభినవ భూతపురి అనే పేరు పొందిన నరసాపురంలో నిర్మింపబడిన శ్రీఆదికేశవ ఎంబెరుమానార్ స్వామివార్ల దివ్యాలయంలో కూడా శ్రీరామానుజుల అర్చామూర్తికి అవతారోత్సవాలు 11 దినాలపాటు మహావైభవంగా జరుగుతాయి. శ్రీపెరుంబూదూరులోవలెనే ఇక్కడకూడా, ఆరవ నాటి ఉత్సవంలో కూరేశవిజయ గ్రంథానుసంధానం జరుగుతుంది. ఈ గ్రంథంలోని విషయాలు సంక్షిప్తంగా ఇక్కడ నివేదింపబడుతున్నాయి.

"సత్త్వం రజః తమ ఇతి ప్రకృతేః గుణాః" (భాగవతమ్) అనే విధంగా సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాలు ప్రకృతికి, దాని కార్యాలు అయిన అచేతన వస్తువులకు ఉంటాయని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ మూడు గుణాలు పరమాత్మకు కాని. జీవునకు కాని స్వరూపంలో లేవు. పరమ పురుషుని దివ్యమంగళ విగ్రహం, అతని నిత్యవిభూతి శుద్ధసత్త్వమయమైనవి. భగవంతుడు, ఈ సంసారమండలంలో సంసారి జీవులకు సత్త్వగుణ ప్రవర్తకుడై ఉన్నందున, అతనిని పరమసత్త్వ సమాశ్రయుడు – అని పెద్దలు చెబుతారు. బ్రహ్మ, రుద్రుడు మొదలైన జీవులకు వారి ఆత్మలో సత్త్వ రజస్తమో గుణాలు లేవు. అయితే, ప్రకృతికార్యమైన వారి శరీరాలలో మాత్రం ఈ గుణాలు కలసి ఉన్నందువల్ల, వారు రజస్తమోగుణప్రవర్తకులుగా ఉన్నారు. ఈ శరీర సంబంధాన్ని పురస్కరించుకుని, రజస్తమోగుణ ప్రవర్తకత్వాన్ని పురస్కరించుకొని, వారిని రజస్తామోగుణాలను కలిగినవారని శాస్త్రాలు చెబుతున్నాయి ఈ సత్త్వరస్తమోగుణాల స్వరూపస్వభావాలు భగవద్గీతలోని 14వ, 17వ అధ్యాయాలలో విస్తృతంగా నిరూపింపబడ్డాయి.

**హస్తే ఽ క్షమాలం హృది రామతత్త్వం**
**స్వమస్తకే కేశవపాదతీర్థమ్,**
**జిహ్వాగ్రభాగే వరరామమంత్రం**
**శివం మహాభాగవతం స్మరామి.**

(చేతిలో తులసీపూసల మాలను, మనస్సులో రామతత్త్వాన్ని, తన శిరస్సులో కేశవుని శ్రీపాదతీర్థాన్ని, నాలుక చివరి భాగంలో గొప్ప రామతారకమంత్రాన్ని కలిగిన మహాభాగవతుడైన శివుని స్మరిస్తున్నాను) అనే ప్రసిద్ధమైన శ్లోకాన్ని అనుసరించి, పరమ భాగవతుడైన శివుని విషయంలో కానీ, అతని భక్తుల విషయంలో కానీ, వైష్ణవులకు ఏ విధమైన ద్వేషభావం ఉండే అవకాశం లేనే లేదు. ప్రకృతి గుణాలు పెట్టే పాట్లచేత, శ్రుతిస్మృతీతిహాస పురాణాలలో శివుని చరిత్రలు ఏ విధంగా వర్ణింపబడ్డాయి – అనేదానిని తెలుపడం కోసమే ఈ గ్రంథం ఒక విధంగా వివరణ చేయబడుతున్నదని సహృదయులు గుర్తించగలరు.



# 1. గాయత్రీమంత్రమ్

**పూర్వపక్షం ––**

గాయత్రీమంత్రంలో ఉండే భర్గశబ్దం "యః భర్గః" అని అకారాంతపుంలింగపదమై, విస్తరించిన జటలను కలిగిన శివుని చెబుతుంది కనుక, గాయత్రీమంత్రం శివపరం –అనేది శైవుల పూర్వపక్షం.

**సిద్ధాంతమ్**

గాయత్రీ మంత్రంలోని అర్థం ఏమంటే, " ఏ దేవుడు మన బుద్ధిని తన విషయంగా ప్రేరేపిస్తున్నాడో, సవిత అనబడే ఆ పరమాత్మయొక్క, ఆశపడదగిన తేజస్సును ధ్యానిస్తాము " – అని. "తత్, వరేణ్యమ్" అనే రెండు పదాలతో పరామర్శింపబడే భర్గశబ్దం తేజస్సు అనే అర్థాన్ని కలిగిన సకారాంత నపుంసకలింగపదం అని భాష్యకారులు అర్థం చెప్పారు. " య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే ––– తస్య యథా కస్యాసం పుండరీక మేవ మక్షిణీ" అనే ఛాందోగ్యోపనిషద్వాక్యాన్ని వివరించే నరసింహ పురాణ వచనం

**"ధ్యేయః సదా సవితృమండలమధ్యవర్తీ**
**నారాయణః సరసిజాసనసన్నివిష్టః,**
**కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ**
**హారీ హిరణ్మయివపుః ధృతశంఖచక్రః"**

(సూర్యమండలం మధ్యలో ఉన్నవాడు, తామర పువ్వు అనే ఆసనంలో కూర్చుని ఉండేవాడు, కేయూరాలను కలవాడు, మకర కుండలాలను కలవాడు, కిరీటాన్ని ధరించినవాడు, హారాలను ధరించినవాడు, బంగారు రంగులో ఉండే దేహాన్ని కలవాడు, శంఖచక్రాలను కలవాడు అయిన నారాయణుడు ఎల్లప్పుడూ ధ్యానించదగినవాడు) అని ఉన్నది.

ఇందులో, "సూర్యమండలంలో ఉండేవాడు నారాయణుడు" – అని స్పష్టంగా ఉన్నది. అతని తేజస్సు గాయత్రీమంత్రంలో భర్గశబ్దంచేత చెప్పబడుతున్నది ఈ భర్గశబ్దాన్ని అకారాంత పుంలింగపదంగా గ్రహించి, శివుని చెబుతుంది అని అనడం వ్యాఖ్యానానికి ఎంత మాత్రం పొసగదు.

బ్రాహ్మణుడు నిద్రనుండి లేచేటప్పుడు " హరిః హరిః హరిః" అని ఏడు మార్లు ఉచ్చరించాలి అని, స్నానం చేసేటప్పుడు గోవింద నామాన్ని మూడుసార్లు ఉచ్చరించాలి అని, గాయత్రీ మంత్రజపం చేయడానికి ముందు దానికి పూర్వాంగంగా చేయబడే ఆచమనంలో అచ్యుత, అనంత, గోవింద నామాలను చెప్పాలి అని, తరువాత కేశవాది ద్వాదశ నామాలను చెప్పాలి అని, వైదిక కార్యాలలో సంకల్పం చేసేటప్పుడు, " శ్రీ గోవింద గోవింద గోవింద" అని ఆరంభించి, ఆ తరువాత " శ్రీవిష్ణోః ఆజ్ఞయా "అనే చెబుతున్నందువల్ల, జపం చేసేటప్పుడు, శుద్ధిచేయడంకోసం

**"అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోపి వా,**
**యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరః శుచిః"**

(పవిత్రుడు కాకపోయినా, పవిత్రుడు అయినా, ఏ స్థితిలో ఉన్నప్పటికీ పుండరీకాక్షుడైన కృష్ణుని స్మరించేవాడు లోపల, బయట పవిత్రుడు అవుతాడు) అనే శ్లోకాన్ని అనుసంధిస్తూ, పుండరీకాక్షుని స్మరిస్తూ, ప్రోక్షణం చేయాలి అని చెప్పబడినందువల్ల. వేదపారాయణానికి ముందు, తరువాత కూడా "హరిః ఓమ్" అనే చెప్పడం వల్ల,

**"ఆకాశాత్ పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్,**
**సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి"**

అని పలువురు అనుసంధిస్తూ ఉన్నందువల్ల, ఏ కర్మను చేసి ముగించినప్పటికీకూడా, అందులో ఏర్పడే లోపాలను, దోషాలను పోగొట్టుకోవడంకోసం

**"ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపఃకర్మాత్మకాని వై,**
**యాని తేషా మశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్"**

అని అనుసంధించడం వల్ల, "కృష్ణ కృష్ణ" అని పలుమార్లు ఉచ్చరించడం విధింపబడడం వల్ల, అగ్నికర్మలలో శివునకు ఆహుతి చేసినప్పుడు అశుచి ఏర్పడగా, ఆ ఆశౌచాన్ని తీర్చుకోవడం కోసం " అపః ఉపస్పృశ్య " అని జలాన్ని తాకి, చేతులను కడిగిపోవడం అనేది విధింపబడడం వల్ల, ఇంకా, అతిరుద్రం మొదలైన హోమాలు యాగశాల లేకుండా బయటనే చేయబడడం వల్ల, సత్త్వగుణ ప్రచురుడైన నారాయణుడే పరతత్వం, అతడే గాయత్రీమంత్ర ప్రతిపాద్యుడు. శ్రుతి స్మృతీతిహాస పురాణ ప్రమాణాలకు విరోధంగా, ప్రకరణానికి చేరకుండా భర్గశబ్దానికి శివపరంగా అర్థాన్ని చెప్పడం అవైదికమే కాగలదు.

## 2. నమకమ్, చమకమ్

### పూర్వపక్షం

రావణుడు వేదానికి పదం, క్రమం, జట, పాదం, ఘనం మొదలైన అలంకారాలను ఏర్పరచినప్పుడు, శివునిపై అభిమానంతో రుద్రుని స్తుతించినట్లుగా కనిపించే మంత్రభాగం నమకం, చమకాలు. దక్షయజ్ఞ సమయంలో చాలా కోపాన్ని పొందిన శివుని కోపాన్ని తగ్గించడం కోసం దేవతలు చేసిన స్తుతియే నమకం, చమకం అని అంటారు ఇందులో రుద్రునకు ఆధిక్యం చెప్పబడినట్లుగా భావించి, శైవులు రుద్రునకు పరత్వం సాధించాలని చూశారు.

### సిద్ధాంతమ్

వేదభాష్యాలలో చాలా ప్రాచీనమైన విద్యారణ్య భాష్యంలో నమక చమక విషయంగా వివరణ ఏమీ కనిపించలేదు కనుక, ఈ మంత్రాలు తరువాతి కాలంలో ప్రక్షిప్తమైనవిగా తోస్తున్నది. ఇంతే కాకుండా,

దక్షయజ్ఞంలో ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి చేసిన స్తుతిగా కనిపిస్తున్నందున, ఇందులో ఉండే స్తుతిచేత శివునకు ఏ విధమైన ఆధిక్యం సిద్ధించదు. తరువాత ఆవిర్భవించిన వేదభాష్యాలలో ఈ మంత్రాలను అగ్నిపరాలు అనే భాష్యం రచించబడింది.

**"సర్వే వేదాః యత్పదమానంతి"** (అన్ని వేదాలు ఎవరి పదాన్నిగూర్చి చెబుతున్నాయో) అనే కఠోపనిషద్వాక్యరీతిలో,

**"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః"** (వేదాలు అన్నిటిచేత తెలియబడేవాడను నేనే) అనే గీతోపనిషత్ వచనానుసారంగా అన్ని వేదాలకు ప్రమేయం శ్రీమన్నారాయణుడే. అందుచేత, విష్ణువే నమకచమక వాక్యాలకుకూడా విషయభూతుడు అవుతున్నాడు. శివుడే పరిజన పరివారాలతో కూడిన విష్ణువును స్తోత్రం చేసినట్లుగా నమకవాక్యాలకు అర్థం చెప్పబడినది. చమకంలో నమకంచేత (నమస్కారంతో) ఏర్పడదగిన ప్రయోజనాలను కోరుతున్నట్లుగానే ఉన్నది. అందుచేత, దీనిని బట్టి ఇక్కడ శివపరత్వం సాధించడం సాధ్యం కాదు.

వేదంలో, ఊర్ణనాభి అనే సాలెపురుగు తన నోటినుండి ఏ విధంగా దారాలను సృష్టించి, తిరిగి తన నోటిలోనికి వాటిని తీసుకుంటుందో, ఆ విధంగానే, విష్ణువు కూడా జగత్తును బ్రహ్మరుద్రాదిదేవతలతో తానే సృష్టిస్తున్నాడు అని, ప్రళయకాలంలో వారిని అందరినీ తనలో ఉపసంహరించుకుంటున్నాడు అని చెప్పబడినందున,

**"నారాయణాత్ బ్రహ్మా జాయతే, నారాయణాత్ రుద్రో జాయతే నారాయణాత్ ఇంద్రో జాయతే --- నారాయణాత్ ప్రజాపతయః ప్రజాయంతే, నారాయణాత్ రుద్రాః వసవః సర్వాణి చ ఛందాంసి నారాయణాదేవ సముత్పద్యంతే, నారాయణాత్ ప్రజాపతయః ప్రజాయంతే, నారాయణే ప్రవర్తంతే, నారాయణే**

**ప్రలీయంతే, సర్వభూతస్థమ్ ఏకం నారాయణం, కారణపురుషమ్ అకారణం పరబ్రహ్మ ఓమ్" (నారాయణోపనిషత్)**

(నారాయణునినుండి బ్రహ్మ పుడుతున్నాడు, నారాయణునినుండి రుద్రుడు పుడుతున్నాడు, నారాయణునినుండి ఇంద్రుడు పుడుతున్నాడు, నారాయణునినుండి ప్రజాపతులు పుడుతున్నారు, నారాయణునివల్లనే ప్రవర్తిస్తున్నారు. నారాయణనిలోనే లీనం అవుతున్నారు. సమస్తప్రాణుల లోపల అంతర్యామిగా ఉండేవాడు నారాయణుడు ఒక్కడే. అతడే కారణపురుషుడు, అతడు, తనకు ఇంకొక కారణాన్ని లేని పరబ్రహ్మ) నారాయణునినుండే బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్ట వసువులు, సప్తర్షులు, నవ ప్రజాపతులు మొదలైన దేవతలు జన్మించారు– అని చెప్పబడినందున, ప్రతికల్పంలోను విష్ణువు నాభీకమలంనుండి బ్రహ్మ పుడుతున్నాడు అని,

**"తత్తత్ పద్మమభూత్పూర్వం తత్ర బ్రహ్మో వ్యజాయత,**
**బ్రహ్మణ శ్చాపి సంభూతః శివ ఇత్యవధార్యతామ్,**
**స్కందః శంభోః సంబభూవ ఏతత్ సృష్టిచతుష్టయమ్"**
**(మహాభారతం)**

(భగవానుని నాభీపద్మనుండి ఏ తామర పూవు పూర్వం పుట్టిందో, అందులోనుండి బ్రహ్మ పుట్టాడు. బ్రహ్మనుండి శివుడు పుట్టాడు. శివునినుండి స్కందుడు పుట్టాడు. ఇది మొదట ఏర్పడిన నాలుగు విధాలైన సృష్టి) అని, బ్రహ్మనుండి రుద్రుడు జన్మిస్తున్నాడు అని చెప్పబడినందున, శివుడే విష్ణువును కారణవస్తువుగా చెప్పినందున, మోక్షాన్ని ఇచ్చేవాడు విష్ణువే అని చెప్పినందున, నమక చమకాలతో శివునకు పరత్వం చెప్పడం సాధ్యం కాదు.

# 3. రామలింగపూజ

**పూర్వపక్షం ––**

రావణుని వధించినందువల్ల శ్రీరామునకు బ్రహ్మహత్యాదోషం ఏర్పడింది. అందువల్ల దానికి పరిహారంగా శ్రీరాముడు సీతతో కలసి, లింగ ప్రతిష్ఠను చేసి పూజించాడు. అందువల్ల శివుడే పరతత్వం – అని శైవులు అంటారు.

**సిద్ధాంతమ్**

చతుర్ముఖ బ్రహ్మ కుమారుడైన విశ్వావసువుకు ఒక రాక్షసి వల్ల జన్మించినవాడే రావణుడు. అతడు బ్రాహ్మణరేతస్సువల్ల పుట్టినవాడే అయినా, అసుర జాతిలో పుట్టినందువల్ల రావణునకు బ్రాహ్మణత్వం లేదు. బ్రాహ్మణుడు ఒక బ్రాహ్మణుని వధిస్తే, ఆ విధంగా వధించినవానికి బ్రాహ్మణత్వం నశిస్తుంది. రావణుడు పలువురు ఋషులను వధించినందువల్ల అతనికి బ్రాహ్మణత్వం లేదు. బ్రహ్మ కుమారుడైన కశ్యపునకు దితి, అదితుల మూలంగా దేవతలు, అసురులు సర్పాలు, పక్షులు మొదలైన జాతులలో సంతానం కలిగింది. ఆ రీతిలో హిరణ్యకశిపుడు కూడా కశ్యపుని కుమారుడే. అతనిని చంపినందుకు నరసింహునకు దోషం ఏర్పడిందా? లేదు కదా!

ప్రజాపతులలో ఒకడై, బ్రాహ్మణ శ్రేష్ఠుడైన దక్షుని వధించినందువల శివునకు బ్రహ్మహత్యాదోషం వచ్చిందని చెప్పేవారు ఉన్నారా? కాళికాదేవి మహిషాసురుని చంపినందువల్ల పాపం ఏర్పడినట్లుగా ఎవరైనా అంటారా? రావణుడు బ్రాహ్మణ జాతి అంటే, అతని తమ్ముడైన కుంభకర్ణునిది కూడా అదే జాతి కదా! అతనిని చంపినందువల్ల పాపం ఏర్పడలేదా? శివభక్తుడైన శిశుపాలుడు చంపినందువల్ల కృష్ణునకు దోషం వచ్చిందని అనేవారు ఉన్నారా? రాముడు మానవుడుగా పుట్టి, దానికి అనుగుణంగా ప్రవర్తించి

చూపించినందున దోషం ఏర్పడింది – అని అంటే, రాముడు క్షత్రియుడు అనే క్రమంలో అధర్మం చేసినవానిని దండించడం పాపం అవుతుందా?

రావణుని వధించినందువల్ల రామునకు బ్రహ్మహత్యా పాతకం ఏర్పడింది – అని ఏ స్మృతిగ్రంథకర్త చెబుతున్నాడు? జగన్మాత అయిన సీతాదేవి విషయంలో విపరీత బుద్ధిని కలిగి ఉన్న కర్మచండాలుని వధించినందుకు బ్రహ్మహత్యాదోషం ఏర్పడింది అని ఏ శాస్త్రం చెబుతున్నది? హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు, మురుడు, మాలి, సుమాలి మొదలైన రాక్షసులను చంపినందుకు రాని బ్రహ్మహత్యా దోషం, రాక్షస జాతిలో పుట్టిన రావణుని చంపినందు వల్ల మాత్రం వచ్చిందా? రావణుడు రాక్షసుడు అనేదానికి ప్రమాణం "విభీషణునిలో రాక్షసచేష్టితాలు లేవు. ఈ రాక్షస కులాన్ని నాశనం చేయడం కోసమే పుట్టినవాడు విభీషణుడు " అని రావణుడే చెప్పిన మాటయే.

వాల్మీకి రామాయణం ఆదికావ్యం. వాల్మీకి ముని రామాయణ కాలంలో జీవించాడు. నారదుడు ఉపదేశించిన రీతిలో బ్రహ్మ విశేషకటాక్షంమూలంగా రామ చరిత్రను యథాతథంగా కావ్యంగా వాల్మీకి ముని రచించాడు. ఇందులో కనిపించనివి వాస్తవానికి దూరమైనవి. ఇందులో, రాముడు లంకలో నుండి తిరిగి వచ్చే దారిలో సేతువులో దిగినట్లుగా గాని, సీతతో లింగ ప్రతిష్ఠను చేసినట్టుగాగాని శ్లోకాలు ఏమీ లేవు. కూర్మస్కాందపురాణాలో ఉన్నాయే! అంటే, అవి తామస పురాణాలు. " తామస పురాణాలను ప్రమాణంగా గ్రహించరాదు " అని శివుడే పార్వతితో చెప్పినట్లుగా పాద్మపురాణంలో చెప్పబడింది. అందుచేత ఇతిహాసాలతో విరోధం లేని పురాణవచనాలే ప్రమాణంగా గ్రహించదగినవి.

**వాల్మీకిరామాయణంలో**

**"అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ ప్రభుః"**

అనే శ్లోకం కనిపిస్తున్నది. మహాదేవుడు శ్రీరామునకు అనుగ్రహం చేసినట్లుగా ఇందులో కనిపిస్తున్నది కదా!– అని అంటే, ఆ శ్లోకం ఉండే సందర్భం అనేది గమనించాలి. అయోధ్యకు తిరిగి రావాలి – అని పుష్పక విమానంలో సీతతో, సుగ్రీవ మహారాజు మొదలైన వానరులతో ఆకాశమార్గంలో వచ్చేటప్పుడు, సీతాదేవికి, యుద్ధం జరిగిన చోటును, సముద్రంలో వారధిని కట్టిన చోటును మొదలైన చోట్లను విమానంలో ఉండే చూపిస్తూ రాముడు వచ్చేటప్పుడు, తాను కట్టిన సేతువును చూపించి, **"అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ప్రభుః"** – ఇక్కడే పూర్వం మహాదేవుడు నాకు అనుగ్రహాన్ని చేశాడు– అని చెప్పినట్లుగా యుద్ధకాండంలో 126వ సర్గలో 16వ శ్లోకంగా కనిపిస్తున్నది. పుష్పక విమానంలో బయలుదేరినవారు కిష్కింధ, ఋశ్యమూక పర్వతం, పంపానది, శబరి ఆశ్రమం, పంచవటి, గోదావరీ నది, ఆగస్త్యుని ఆశ్రమం, అనసూయ అనుగ్రహించిన చోటు, అనే వీటిని విమానంలో నుండి దర్శిస్తూ వచ్చి చిత్రకూటంలో భరద్వాజుని ఆశ్రమంలోకి చేరి, అక్కడ విమానం నుండి కిందకు దిగారు. అంతే తప్ప, దారిలో మరి వేరొక చోటు ఎక్కడా కింద దిగినట్లుగా లేదు. సేతువులో దిగడం గాని, అక్కడ ఉండి శివపూజను చేసినట్లుగా గాని కనిపించదు. దానికి అవకాశం ఏ మాత్రం లేదు.

పైన ప్రస్తావించిన శ్రీరామాయణశ్లోకంలో ఉండే మహాదేవశబ్దం రుద్రుని నిర్దేశించదు. "మహత్" అనేది జలతత్త్వమై, జలతత్త్వ రూపమైన సముద్రరాజు అయిన వరుణునే ఈ శబ్దం నిర్దేశిస్తుంది. శ్రీరామాయణానికి వ్యాఖ్యానం చేసిన శ్రీగోవిందరాజులు, మహేశ్వరులు మొదలైనవారు ఈ పదానికి సముద్రరాజు అనే అర్థాన్నే గ్రహించారు అందువల్ల, మహాదేవుడు అనేదానికి రూఢిని గ్రహించి, శివుడనే అర్థం చెప్పడం తగదు. శ్రీరామాయణంలో, కుమారస్వామి ఉత్పత్తినిగూర్చి చెప్పేటప్పుడు, పార్వతీ పరమేశ్వరుల సంగమాన్ని గూర్చిన ప్రస్తావనలో పరమశివుని " సురపతి " అనే

పదంతో వాల్మీకి నిర్దేశించారు. సురపతి అనే పదం రూఢి ద్వారా ఇంద్రుని తెలుపుతుంది. ఈ రూఢిద్వారా ఏర్పడే అర్థాన్ని పురస్కరించుకుని, పార్వతికి ఇంద్రునకు సంబంధం ఏర్పడిందని చెప్పవచ్చునా? అందువల్ల, రూఢిని గ్రహించి ఇక్కడ మహాదేవ శబ్దానికి పరమశివుడు అని అర్థం చెప్పడం సాధ్యం కాదు. " శ్రీరామునకు రుద్రుడు అనుగ్రహం చేశాడు "అనే అర్థాన్నే గ్రహిస్తే, ఆ అనుగ్రహం సేతునిర్మాణ కాలంలోనా? లంకలోనుండి తిరిగి వచ్చేటప్పుడా? సేతునిర్మాణ కాలంలో– అని చెప్పడానికి లేదు. ఏ ప్రయోజనాన్ని ఆశించి శివుని రాముడు శివుని ఆరాధించాడు? వారధిని కట్టడం కోసం అని చెప్పడానికి లేదు. సముద్రంలో వారధిని కట్టడం కోసం శివుని ఆరాధించవలసిన అక్కరలేదు. సముద్రరాజును ఆరాధించాలి. రావణుడు శివభక్తుడు కనుక, శివుని అనుగ్రహాన్ని, అనుమతి పొందడం కోసం శ్రీరాముడు శివుని ఆరాధించాడు – అని కూడా చెప్పడానికి లేదు. బాలకాండలో

**"స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః,**
**అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుః సనాతనః"**

**(శ్రీరామాయణం – అయోధ్యాకాండ)**

(గర్వించిన రావణుని వధించాలిఅని కోరిన దేవతలచేత ప్రార్థింపబడిన, నాశం లేని శ్రీమన్నారాయణుడే మానవలోకంలో శ్రీరామునిగా అవతరించాడు) అని విష్ణువును అవతరించమని శివుడు మొదలైన దేవతలు ప్రార్థించినట్లుగా కనిపిస్తున్నందున, ఇప్పుడు శ్రీరాముడు శివుని అనుమతి పొందవలసిన అక్కర ఏ మాత్రం లేదు. శ్రీరామునిచేత పంపబడిన అసురులు పలువురు శివభక్తులుగానే కనిపిస్తున్నారు. వారిని చంపడానికి శ్రీరాముడు శివుని అనుమతి పొందినట్లుగా మనకు కనిపించదు. అందుచే సేతువును నిర్మించేటప్పుడు శివుని ఆరాధనను కానీ, శివుని అనుగ్రహం కానీ ఏర్పడే దారి

లేదు. మహాదేవ శబ్దానికి. అందువల్ల, ఈ సందర్భంగా సముద్రరాజు అనే అర్థాన్నే గ్రహించాలి.

శ్రీరాముడు మూడు నాళ్ళు సముద్రతీరంలో శయనించి, సముద్రరాజును ఉద్దేశించి శరణాగతి చేసిన తరువాతనే, సముద్రరాజు పరిగెత్తుకుని వచ్చి, శ్రీరాముని క్షమించమని ప్రార్థిస్తూ, శ్రీరాముడు సముద్రంలో వారధి కట్టడానికి సమ్మతించాడు. తనకు ఒకడు చేసిన సహాయాన్ని అలా గొప్పగా భావించే స్వభావాన్ని కలిగిన శ్రీరాముడు, సీతకు సేతువును చూపించి, సముద్రరాజు ఉద్దేశించి, ప్రభుః, అని, కేవలం దేవుడు అని మాత్రం అనకుండా, ఇతడు కేవలం దేవుడు కాదు, మహాదేవుడు అని, నాకు వారధిని కట్టడానికి దారిని ఇచ్చి అనుగ్రహం చేశాడు, –అని ప్రశంసిస్తూ పలికాడు. "అత్ర పూర్వం " –ఇక్కడ వారధిని కట్టడానికి ముందు, "మహాదేవః "–మహత్ అనే జలతత్వానికి దేవుడైన సముద్రరాజు, "ప్రసాదమకరోత్" – అనుగ్రహాన్ని చేశాడు– అని ఈ శ్లోకానికి అర్థం. అందువల్ల, ఇక్కడ, మహాదేవుడు అని రుద్రుడు చెప్పబడడం లేదు.

కేవలం వాదంకోసంగా, రామునకు బ్రహ్మహత్యాదోషం ఏర్పడినట్లుగాను, లింగపూజను చేసినట్లుగాను భావించినప్పటికీ, లంకలోనే రావణుని సంహారానికి తరువాత, శివుడు సాక్షాత్తుగా వచ్చి, రాముని పొగడి, "నీ తండ్రి దశరథ చక్రవర్తి ఇదిగో వచ్చాడు. అతనిని, నీవు, లక్ష్మణుడు నమస్కరించండి" అని చూపించినప్పుడు, శివుని పూజను చేయకుండా, సముద్రాన్ని దాటి వచ్చి, శివలింగాన్ని ప్రతిష్ఠించడం ఎందుకు? పూజలను చేయడం ఎందుకు?

శివుడు ఇచ్చిన చంద్రహాసం అనే ఖడ్గంతో రావణుడు జటాయుమహారాజును ఖండించి, కింద పడగొట్టినందున, శివుడు, తానుకూడా ఒక రీతిలో అపచారానికి కారణం కావడానికి భావించి, బాధపడి, శ్రీరామునితో, తాను చేసిన పాపం తొలగే మార్గాన్ని ప్రశ్నించగా, అన్ని

పాపాలను పోగొట్టే సేతువుతీరంలో ధ్యానం చేస్తూ ఉండు" అని రాముడు అనగా, ఆ మాట ప్రకారమే పరమశివుడు సేతువు తీరంలో రాముని ధ్యానిస్తూ, తన పాపాన్ని పోగొట్టుకోవడంతో పాటు, తనను సేవించేవారి పాపాలను కూడా పోగొట్టేవాడై ఉన్నందున, రాముని అనుగ్రహం పొందిన ఈశ్వరుడు రామేశ్వరుడు అని, అతడు ఉండే చోటు రామేశ్వరం అని ప్రసిద్ధిని పొందినవి.

రామలింగం అని అంటే, రాముని చేత పూజింపబడిన లింగం అని చెప్పడానికి లేదు. ఎందుకంటే, శివలింగం అనేదానికి శివుని చేత పూజింపబడిన లింగం అని చెప్పడానికి వలసి వస్తుంది కనుక. శివుని గూర్చిన "హస్తేఽ క్షమాలాం ––– నమామి" అనే ప్రసిద్ధమైన శ్లోకం ప్రకారం, శివుని మనస్సులో రామతత్త్వం, నాలుక చివర రామతారక మంత్రం ఎల్లప్పుడూ ఉంటాయి కనుక, రాముని హృదయంలో కలిగిన లింగం, కనుక, రామలింగం అనే అర్థాన్ని గ్రహించాలి.

పార్వతితో శివుడు "సహస్రనామ తత్తుల్యం రామనామ" రామనామం విష్ణువు వేయి నామాలకు సమానమైనది – అని చెప్పినందువల్ల శివుని రాముడు పూజించాడు అని అనడం తగదు. శివుని మహాదేవుడు అని అన్నందున, అతడు దేవతలు అందరికంటే గొప్పవాడు అని తెలుస్తున్నది కదా !–అని అంటే, మహేంద్రుడు అనే పేరు ఉన్నది కదా. అందువల్ల, ఇంద్రుని దేవతలు అందరి కంటే గొప్పవాడు – అని చెప్పగలమా? మహావృక్షం అని జెముడు చెట్టుకు పేరు ఉంది కదా. అందువల్ల ఆ చెట్టు చాలా గొప్ప చెట్టు – అని చెప్పడానికి వీలవుతుందా? ఏ శుభకార్యానికి ఉపయోగించని వారానికి మంగళవారం అనే పేరు ఉన్నది కదా. మంగళమైన కార్యాలను ఆనాడు చేయవచ్చునా? విషం ఉండే పాముకు "నల్ల పాంబు" అనే అర్థం ఉన్నదే. మరి, దానిని నిర్భయంగా వెంబడించవచ్చునా? అందువల్ల మిగిలిన ప్రమాణాలకు విరుద్ధంగా ఉండేటప్పుడు, కేవలం పేరును పురస్కరించుకొని అర్థనిర్ణయం

చేయడం సాధ్యం కాదు. అందువల్ల ఇక్కడ మహాదేవశబ్దాన్ని పురస్కరించుకొని శివునకు పరత్వాన్ని చెప్పడం ఈ సందర్భంగా వీలు కాదు.

## 4. శ్రీకృష్ణుని కైలాసయాత్ర

**పూర్వపక్షం –**

శ్రీకృష్ణుడు కైలాసానికి వెళ్లి, శివుని ఉద్దేశించి తపస్సు చేసి, శివుని వద్ద వరంగా సంతాన ప్రాప్తిని అర్థించినందువల్ల, శివుడు ఆ విధంగానే వరాన్ని ఇచ్చినందువల్ల శివుడే పరుడు అని శైవులు అంటున్నారు.

సిద్ధాంతమ్

తామస దేవతలకు ఈ జన్మ అనే వ్యాధికి తగిన మందు ఏదో తెలియరు. సంసారం వృద్ధి కావటాడానికి తగిన మందును మాత్రం తెలియగలరు. దానిని వ్యక్తం చేయడంకోసం చేసిన కైలాసయాత్రలో శ్రీకృష్ణుడు ఘంటాకర్ణునకు మోక్షాన్ని ఇచ్చి, తాను రుద్రుని వద్ద సంతానాన్ని వరంగా ప్రార్థించాడు.

ప్రతి కల్పంలోనూ, బ్రహ్మ నుండి రుద్రుడు పుడుతున్నట్లు, వేరొక కల్పంలో రుద్రుడు నేరుగా విష్ణువు నుండి పుట్టినట్లు చెప్పిన రీతిలో, తాను శ్రీకృష్ణునిగా అవతరించినప్పుడు తనకు పుత్రుడు, పౌత్రుడు అయిన శివుని కటాక్షించడం కోసం కృష్ణుడు కైలాసం వెళ్ళినప్పుడు, శివుడు, కృష్ణుని దగ్గర కేశవనామాన్ని వివరించి పలుకుతూ,

**“క ఇతి బ్రహ్మణో నామ ఈశోహం సర్వదేహినామ్,**
**ఆవాం తవాంగే సంభూతౌ తస్మాత్ కేశవనామవాన్”**

(కః అని బ్రహ్మ చెప్పబడుతున్నాడు. నేను, సమస్త ప్రాణులకు ఈశ్వరుడను. మేమిద్దరం నీ శరీరంనుండి పుట్టాము. అందువల్ల నీవు కేశవనాముడవు అయ్యావు) అని పలికినందు వల్ల,

మహాభారతంలో కృష్ణునకు సంతాన ప్రాప్తివరాన్ని ఇచ్చిన శివుడు అక్కడ ఉండే దేవతలను ఋషులను చూసి "కృష్ణుడు లోకాన్ని మోహింప చేయడంకోసం నా దగ్గర వరాన్ని కోరి వచ్చాడు. ఇతడే సర్వకారణభూతుడు, సర్వరక్షకుడు. ఇతనిని ఉపాసించి, ముక్తులు కావడానికి ప్రయత్నం చేయండి" అని అన్నందు వల్ల, శివుని అంశ అయిన అశ్వత్థామ ప్రయోగించిన ఆస్త్రాలతో ఉత్తరగర్భం కాలిపోయిన కట్టెగా ప్రసవించగా, కృష్ణుడు దానిని తన పాదంతో తాకినపుడు, ఆ శిశువును చక్కని మగశిశువుగా రూపొందించడంచేత, ఇప్పుడు కైలాసయాత్ర సందర్భంగా ఆశ్రయించిన ఘంటాకర్ణుని పాపాలను మన్నించి, కృష్ణుడు అతనికి, శివునిచే ఇవ్వడానికి సాధ్యం కాని మోక్షాన్ని, ఇవ్వడంచేత,

**వేదంలో,**

**"అస్య దేవస్య మీఢుషో వయా విష్ణో రేషస్య ప్రకృతేః హవిర్భిః, విధేహి రుద్రో రుద్రియం మహత్వం యాసిష్టం వర్తి రశ్వినా విరావత్" (ఋగ్వేదం –మండలం –7 – సూక్తమ్ 41 –5)**

(కోరికలను వర్షించేవాడు, ప్రార్థించదగినవాడు, సహజమైన దేవుడైన విష్ణువుకు శాఖవంటివాడైన రుద్రుడు సర్వమేధం అనే గొప్ప యాగంలో తనతో పాటుగా అన్ని హవిస్సులను ఇచ్చి, రుద్రపదవికి సమానమైన గొప్పతనాన్ని పొందాడుకదా) అని,

**ఉపబృంహణాలలో**

**"మహాదేవః సర్వమేధే మహాత్మా**
**హుత్వాత్మానం దేవదేవో బభూవ" (భారతం –శాంతిపర్వమ్)**

(మహాత్ముడైన శివుడు సర్వమేధయాగంలో తననే హోమం చేసికొని దేవదేవుడు అయ్యాడు) ,

**"బ్రహ్మాదయః సురా స్సర్వే విష్ణు మారాధ్య తే పురా,**

**స్వం స్వం పద మనుప్రాప్తాః కేశవస్య ప్రసాదతః"**

**(నరసింహ పురాణం)**

(బ్రహ్మ మొదలైన దేవతలు అందరూ పూర్వం విష్ణువును ఆరాధించి, తమ తమ పదవులను ఆ కేశవుని అనుగ్రహం వల్ల పొందారు) శివుడు తీవ్రమైన తపస్సు చేసి, నారాయణుని అనుగ్రహం వల్ల సంహారకర్త అయ్యాడు —అని చెప్పబడినందు వల్ల,

విష్ణుభగవానుడు మానవుడుగా అవతరించినప్పుడు, ఆ అవతారంలో అవతార సత్యత్వానికి అనురూపంగా బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలను ఆరాధించడం తన పరత్వాన్ని ఏ విధంగానూ తగ్గించదు కనుక,

**"అన్యం దేహి వరం దేవ! ప్రసిద్ధం సర్వ జంతుషు,**
**మర్త్యో భూత్వా భవానేవ మా మారాధయ కేశవ!,**
**మాం వహస్వ చ దేవేశ! వరం మత్తో గృహాణ చ,**
**యేనాహం సర్వభూతానాం పూజ్యాత్ పూజ్యతరో ఽ భవమ్"**

**(వరాహ పురాణం −73− 41, 42)**

(దేవుడవైన కేశవా! జీవులందరికి ప్రసిద్ధమైన వేరొక వరాన్ని నాకు నీవు ఇవ్వాలి. అది ఏమంటే, నీవు మానవునిగా జన్మించాలి. నన్ను ఆరాధించాలి. నన్ను నీవు మోయాలి. దేవతలకు ప్రభువైనవాడా! నీవు నా దగ్గరనుండి వరాన్ని పొందాలి. నీవు ఈ విధంగా చేస్తే, నేను జీవులందరిలోనూ నీకంటే ఎక్కువ పూజించదగినవాడను కాగలను) ,

**"దేవకార్యావతారేషు మనుష్యత్వ ముపేయివాన్,**
**త్వామేవారాధయిష్యామి హర త్వం వరదో భవ"**

**(వరాహ పురాణం −73:43)**

(దేవకార్యాలను నిర్వహించడంకోసం నేను అవతారాలను ఎత్తేటప్పుడు, మానవునిగా అవతరించే నేను నిన్నే ఆరాధిస్తాను. అపుడు నీవు

నాకు వరాన్ని ఇచ్చేవాడవు కాగలవు) అని చెప్పిన విధంగా, "మనుష్యావతారాలలో నీవు నా దగ్గర వచ్చి, ఒక వరాన్ని కోరి, పొంది, నాకు గొప్పతనాన్ని కలిగించాలి" అని శివుడు ప్రార్థించగా ఆ ప్రార్థనను పూర్తి చేయడంకోసమే విష్ణువు కృష్ణావతారంలో కైలాసానికి వెళ్లి, శివుని దగ్గర సంతాన ప్రాప్తిరూపమైన వరాన్ని ప్రార్థించి పొందినట్లుగా వరాహపురాణంలో చెప్పబడడంవల్ల, విష్ణువే పరుడు, రుద్రుడు పరుడు కాబోడు.

## 5. విష్ణుచక్రమ్

### పూర్వపక్షం

జలంధరుని వధించడంకోసం విష్ణువు శివుని వేయి తామర పువ్వులతో అర్చన చేయాలని ప్రయత్నం చేసిన కాలంలో, ఒక తామర పువ్వు తక్కువ కాగా, దానికి బదులుగా తన కంటిని పెకలించి సమర్పించినట్లు, దానిని చూసిన శివుడు సంతోషించి, విష్ణువునకు చక్రాయుధాన్ని ప్రసాదించినట్లుగా చెప్పబడడంచేత, విష్ణువే పరుడు – అని శైవులు అంటున్నారు.

### సిద్ధాంతమ్

శ్రుతిస్మృతీతిహాస పురాణాలలో విష్ణువునకు చక్రం అనాదిగా, అంటే, నిత్యంగా ఉన్నది – అని చెప్పబడడంచేత, ఛాందోగ్యంలో

**"య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే"**

(సూర్యాంతర్యామిగా బంగారు రంగును కలిగిన ఏ పురుషుడు కనబడుతున్నాడో, ) అనే వాక్యాన్ని వివరించే నరసింహ పురాణ శ్లోకం

**"ధ్యేయః సదా సవితృమండలమధ్యవర్తీ**
**నారాయణః సరసిజాసనసన్నివిష్టః,**
**కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ**
**హారీ హిరణ్మయివపుః ధృతశంఖచక్రః"**

(సూర్యమండలం మధ్యలో ఉన్నవాడు, తామర పువ్వు అనే ఆసనంలో కూర్చుని ఉండేవాడు, కేయూరాలను కలవాడు, మకర కుండలాలను కలవాడు, కిరీటాన్ని ధరించినవాడు, హారాలను ధరించినవాడు, బంగారు రంగులో ఉండే దేహాన్ని కలవాడు, శంఖచక్రాలను కలవాడు అయిన నారాయణుడు ఎల్లప్పుడూ ధ్యానించదగినవాడు) అని ఉన్నందున, "సమస్త దేవతలు, మానవులు అగ్నిచేత తప్తం చేయబడిన సుదర్శనచక్రాంకనాన్ని రెండు భుజాలలోనూ ధరించాలి. ఆ విధంగా ధరించినవారు శ్రీమన్నారాయణుని సాయుజ్యాన్ని పొందుతున్నారు – అని చెప్పబడినందున. అగస్త్య సంహితలో శస్త్రాలకు రాజు అయిన సుదర్శనుని ఆరాధించి, శూలాన్ని నేను పొందినట్లు, బ్రహ్మ ఆజ్ఞాపించిన రీతిలోనే సుదర్శన చక్రంవద్దనుండి నేను శూలాన్ని పొంది, బ్రహ్మ అభిప్రాయానికి తగినట్లుగా కల్పాంతంలో సంహరిస్తాను –అని శివుడే చెప్పినట్లు కనబడుతున్నందున, అదే సంహితలో శివుడు కాశీలో చక్రాయుధానికి భయపడి పరుగు తీసినట్లుగా చెప్పబడినందున, రుద్రాంశను కలిగిన దుర్వాసుడు సుదర్శనచక్రం వల్ల పడిన పాట్లు అవమానం అంబరీషుని చరిత్రలో ప్రసిద్ధంగా కనిపిస్తున్నందున, శ్రుతిలో, శివుడు విష్ణువునుగూర్చి తపస్సు చేసి సంహారకర్తగా అయినట్లుగా కనిపిస్తుందున, అతడు బ్రహ్మ వల్లపుట్టినట్లుగా కూడా చెప్పబడినందున, బ్రహ్మను జనింపజేసిన విష్ణువు శివుని పూజించి, చక్రాయధాన్ని పొందాడు –అనేది అపహాస్యానికి తగిన మాటయే అవుతుంది. శివుడు వేయి తామర పువ్వులతో విష్ణువును ఆరాధించేటప్పుడు ఒక పుష్పం తక్కువ కాగా, తన ముక్కును కోసి ఆరాధించడాన్ని చూసిన విష్ణువు, శివుని ఉమాదేవి అనే ఇద్దరికీ వారి లింగాలు ఏర్పడేటట్లుగా అనుగ్రహించడాన్ని చెప్పే పురాణ వచనాన్ని విరుద్ధంగా కల్పింపబడిన చరిత్రయే, ఇది

వటవృక్షం మూలంలో దక్షిణామూర్తి అనే పేరుతో చేతిలో చిన్ముద్రను ధరించి, శివుడు శ్రీమన్నారాయణుని ధానిస్తున్నట్లుగా

చెప్పేటప్పుడు నారాయణుడు తన కంటిని పెకలించుకుని, శివుని పూజించాడు– అనేది అసత్యమైన మాటయే అవుతుంది. అందువల్ల విష్ణువే ప్రకృష్టుడు, పశుపతి కాడు – అనేది స్పష్టం.

**ఈ సందర్భంగా ప్రస్తావింపబడిన అంబరీషుని చరిత్ర వివరం ఏమంటే–**

అంబరీషుడు అనే రాజు ఏకాదశీ వ్రతాన్ని చేసేవాడు. ఒక ద్వాదశీ తిథిలో, ఉదయకాలంలో, ఆ అంబరీషుని దగ్గరకు దుర్వాసమహర్షి వచ్చి, " నేను ఈ ద్వాదశిథితిలో నీ వద్ద పారణను చేస్తాను" అని అన్నాడు. అప్పుడు అంబరీషుడు ఆ ఋషితో "మీరు స్నానం మొదలైన అనుష్ఠానాలను పూర్తి చేసుకుని రండి " అని పంపించాడు. పూర్వాసమహర్షి తిరిగి రావడానికి చాలా ఆలస్యం చేశాడు. పారణ చేసే కాలం అతిక్రమిస్తూ ఉన్నందున, అంబరీషుడు జలాన్ని స్వీకరించి, ద్వాదశి పారణను పూర్తిచేశాడు. దుర్వాసమహర్షి తన తపోబలంతో జరిగిన సంగతిని తెలుసుకుని, " నేను రాకుండానే పారణను చేశావు. నేను, నీవు పారణ చేయగా మిగిలిన శేషాన్ని స్వీకరించబోను" అని కోపంగా అన్నాడు. " స్వామీ! మీకోసం తీసి ఉంచిన ప్రసాదాన్ని నేను పారణ చేయలేదు. జలాన్ని మాత్రమే పారణ చేశాను" అని అంబరీషుడు నచ్చచెప్పడానికి ప్రయత్నించేశాడు కానీ, ఆ మహర్షి అంబరీషుని మాటను వినకుండా, "నేను రాకుండానే, అతిథిని అయిన నన్ను అవమానం చేసి, పారణను ముందుగానే చేశావు, నిన్ను తగిన విధంగా శిక్షిస్తాను" అని అంబరీషుని శపించడానికి సిద్ధపడ్డాడు.

అంబరీషుడు అపుడు, భగవంతుని ఆయుధమైన చక్రాయుధాన్ని మనస్సులో స్మరించాడు వెంటనే సుదర్శన చక్రం ప్రత్యక్షమై ఆ దుర్వాస మహర్షిని తరుమడం ఆరంభించింది. అతడు భయంతో బ్రహ్మాదిదేవతల దగ్గరకు వెళ్లి, తనను కాపాడమని ప్రార్థించాడు. కానీ, వారు అతనిని రక్షించడం తమకు సాధ్యం కాదని అన్నారు. చివరకు ఆ మహర్షి

భగవంతుడైన శ్రీమన్నారాయణుని దగ్గరకు వెళ్లి కాపాడమని ప్రార్థించాడు. భగవానుడు కూడా, " నేను భక్తపరతంత్రుడను. అందుచేత, నీవు ఆ అంబరీషుని దగ్గరకే వెళ్లు" అన్నాడు. ఆ ఋషి కూడా, ఆ విధంగానే అంబరీషుని దగ్గరకు వెళ్లి, తనను కాపాడమని ప్రార్థించాడు. అంబరీషుడు సుదర్శన చక్రాన్ని దుర్వాస మహర్షిని క్షమించి, విడిచిపెట్టవలసినదని ప్రార్థించగా, అతని మాటకు కట్టుబడి సుదర్శనుడు దుర్వాసుని విడచి పెట్టి, తిరిగి వెళ్ళిపోయాడు.

**"ఏకః ప్రాసీసరత్పాదం ఏకః ప్రాచిక్షిపన్ముదా,**
**అపరో ఽ భ్యధరన్మూర్ధ్నా కో ఽ ధికః తేషు గణ్యతామ్"**

(ఒకడు పాదాన్ని చాచాడు ఇంకొకడు ఆ పాదాన్ని కడిగాడు. వేరొకడు ఆ పాదతీర్థాన్ని తలపై ధరించాడు. ఈ ముగ్గురిలో ఎవరు గొప్పవారు? అని మీరే భావించి తెలుసుకోండి) అని చోళరాజు సభలో కూరేశులు పలికిన వాక్కు.

## 6. మన్మథ దహనం

**పూర్వపక్షం –**

శివుడు మన్మథుని దహించడం వల్ల, శివుడే పరుడు– అని శైవులు అంటున్నారు.

**సిద్ధాంతమ్**

పాము కరిస్తే పాము తల ఎక్కకుండా అడ్డుకోవడం కష్టం. కాని పామును చంపడం కష్టమైన పనా? మన్మథుని చేత ప్రయోగింపబడ్డ బాణాలచేత వికారాన్ని పొందకుండా ఉంటే కదా, శివునకు గొప్పతనం ఉన్నదని చెప్పవలసి ఉంటుంది. శివుడు వికారాన్ని పొంది, పార్వతితో సంగమాన్ని పొంది, బహిర్గతం చేసిన రేతస్సునుండి స్కందుడు, సుబ్రహ్మణ్యుడు మొదలైనవారు జన్మించినట్లుగా పురాణాలలో చెప్పబడడం

చేత, "ద్రోణాచార్యుల పత్నికి నితంబ ప్రదేశం చాలా అందంగా ఉంటుంది" అని గంధర్వులు చెప్పుకోవడాన్ని విన్న శివుడు, కైలాసంనుండి బయలుదేరి, ఆమె జఘనాన్ని చూడాలని అదితి రూపంలో వచ్చి, భిక్షను యాచించగా, ద్రోణాచార్యుని నియమనంతో అతని పత్ని ఏడుస్తూ రాగా, " ఆ విధంగా తీసుకొని వస్తే నేను స్వీకరించను. ఆనందంగా రావాలి" అని శివుడు అనగా, అదితి ప్రార్థించిన రీతిలోనే సమర్పించాలి – అని శాస్త్రమై ఉన్నందున, ద్రోణుడుకూడా తన పత్నిని వస్త్రాన్ని తొలగించి, ఆమె కేశపాశంతో దేహాన్ని ఆచ్ఛాదించుకుని, ఆమెను శివుని దగ్గరకు వెళ్ళమని చెప్పగా, శివుడు వాయుదేవతను సహాయాన్ని గ్రహించి, ఆమె కేశపాశాన్ని అపుడు తొలగిపోయేటట్లుగా చేసి, ఆమె యోనిని చూసిన అనంతరం తన రేతస్సును బహిర్గతం చేయగా, ఆ రేతస్సు ఆశ్రమంలో అశ్వత్థంగా నిలుపబడిన కొరివి కట్టెపై పడగా, దానిని ఒక అశ్వం భుజించి, గర్భం ధరించింది. అప్పుడు పుట్టిన శిశువునకు అశ్వత్థామ అనే పేరు కలిగింది – అనే కథ భారతంలో చెప్పబడినందువల్ల, పురుషోత్తముని స్త్రీవేషాన్ని చూచి, మోహాన్ని పొంది, రేతస్సును బహిర్గతం చేయగా, అప్పుడు దాని నుండి శాస్తా అనే పుత్రుడు పుట్టినట్లుగా చెప్పబడినందువల్ల, శివుడు మన్మథుని జయించినవాడు – అని చెప్పడం సత్యదూరమే కాగలదు.

సూర్యవంశంలో పుట్టిన క్షత్రియులకు మూలపురుషుడైన ఇక్ష్వాకు మహారాజు సత్య లోకంలో బ్రహ్మ ఆరాధించే శ్రీరంగనాథుని భూలోకానికి తీసుకుని రావాలి – అని తపస్సును చేశాడని, అతని తపస్సు వల్ల ఏర్పడిన తాపాన్ని సహించలేని ఇంద్రాది దేవతలు మన్మథుని ప్రేరేపించి, అతని తపస్సుకు భంగం కలిగించమని చెప్పగా, మన్మథుడు తన పంచ బాణాలను ప్రయోగించినప్పుడు, ఇక్ష్వాకువు ఆ బాణాలతో ఏ వికారాన్ని పొందకుండా, మన్మథుడు ప్రయోగించిన ఆ పుష్పాలను తీసుకొని, మన్మథుని అర్చించగా, అతడు సిగ్గుచెంది, బ్రహ్మ దగ్గరకు వెళ్లి మొర పెట్టాడు. అప్పుడు బ్రహ్మ

ప్రత్యక్షమై, తన తిరువారాధనమూర్తి అయిన శ్రీరంగనాథుని ఇక్ష్వాకువుకు ఇచ్చిన కథ గారుడ పురాణంలో చెప్పబడినది కనుక, మన్మథుని జయించిన ఇక్ష్వాకు మహారాజుకు పరత్వం చెప్పవలసి ఉంటుంది. అందువల్ల, మన్మథుని జయించనివానిని జయించినట్లుగా చెప్పి, అందువల్ల శివునకు పరత్వం చెప్పడం అబద్ధమే.

**"అన్యత్ర భీష్మాత్ గాంగేయా దన్యత్ర చ హనూమతః,**
**హరిణీఖురమాత్రేణ చర్మణా మోహితం జగత్"**

(గంగాపుత్రుడైన భీష్ముడు, హనుమంతుడు తప్ప, లోకంలో ఉండే మిగిలిన అందరు జీవులు, లేడిగిట్ట పరిమితిలో ఉండే స్త్రీయోని అనే చర్మంతో వ్యామోహాన్ని పొందుతున్నారు) అనే సూక్తి ప్రసిద్ధమైనది కనుక, నిజానికి, మన్మథుడు చావకుండా అనంగుడుగా ఉన్నాడని చెప్పబడినందువల్ల, "బ్రహ్మను, రుద్రుని నేనే సృష్టించాను, వారు నా గొప్పతనాన్ని తెలియజేయలేరు, వారు నా మాయవల్ల బాగా మోహాన్ని పొందుతున్నారు" అని భగవానుని వచనానికి అనుగుణంగా శివాదుల ప్రవర్తన కనిపిస్తున్నందున, భృగుముని శాపంచేత శివునకు, ఉమాదేవికి వారి లింగాలు లేకుండా పోవడం, ఆ విధంగా లేకుండా చేయబడిన లింగాలను శైవులు పూజించడం ప్రసిద్ధం కనుక, మన్మధుని దహించిన పశుపతి పరుడు కాడు. "మమ్ములను, మిమ్ములను చేర్చిన ఇతడు సుందరుడై ఉన్నాడే" అని శివుడు అతనిని చూడగా, మన్మథుడు ఆనంగుడయ్యాడు అంటే, శివుని దృష్టిదోషాన్ని చెప్పినట్లే అవుతుంది కదా.

## 7. హాలాహలవిషపానం

### పూర్వపక్షం

దేవతలు, అసురులు పాల సముద్రాన్ని చిలిగినప్పుడు, వాసుకినోటినుండి బయటకు వచ్చిన హాలాహల విషాన్ని శివుడు తాగి,

నీలకంఠుడు అయ్యాడు, అందుచేత, ఆ శివుడే పరుడు – అని శైవులు అంటున్నారు.

## సిద్ధాంతమ్

హిరణ్యకశిపుడు అష్టమహానాగాలను నియోగించి, ప్రహ్లాదుని, వాటి విషాన్ని తాగేటట్లుగా చేసినప్పుడు, ఆ విషాన్ని ప్రహ్లాదుడు అమృతంవలె పానం చేసినందువల్ల, పూతన తన స్తన్యం పూసికొని వచ్చిన విషాన్ని బాలుడైన శ్రీకృష్ణుడు ఆరగించినందువల్ల, విష్ణువు ప్రళయ కాలంలో అండాలను అన్నిటినీ ఆరగించినప్పుడు, హాలాహల పానాన్ని చేసిన శివునితో పాటుగా అందరిని తన కడుపులో గ్రహించినందువల్ల,

పాలసముద్రాన్ని చిలిపినప్పుడు, వాసుకి నోటినుండి బయటకు వచ్చిన విషాన్ని చూచి భయపడిన దేవతలు, దగ్గర ఉండే భగవానుని దగ్గరకు వెళ్లి మొరపెట్టకుండా, ఖట్వాంగుడు, ముచికుందుడు మొదలైనవారి దగ్గర మొరపెట్టినట్లుగానే, కైలాసంలో ఉండే శివుని దగ్గరకూడా మొరపెట్టగా, శివుడు "నేను రక్షిస్తాను" అని చెప్పి, బయటకు వచ్చిన ఆ విషాన్ని చూసి, ఒక హుంకారం చేయగా, విషం ఆగకుండా ఇంకా ఇంకా అతని పైకి రావడం ఆరంభించింది. శివుడు శ్వేతద్వీపంలో ఉండే శ్రీమహావిష్ణువును ధ్యానించగా, భగవానుడు ప్రత్యక్షం అయ్యాడు. శివుడు అప్పుడు "హాలాహలవిషంనుండి రక్షిస్తానని దేవతలకు నేను మాట ఇచ్చాను. ఈ విషం నా హుంకారంతో అడ్డుకోవడం సాధ్యం కాలేదు. వేగంగా ప్రవహిస్తూ వస్తున్నది. నన్ను రక్షించాలి" అని ప్రార్థించగా అప్పుడు భగవానుడు "ఇప్పుడు హుంకారం చేయి " అని శివుని నియమించగా, శివుడు మళ్ళీ హుంకరించాడు. అప్పుడు ఆ విషం పర్వతంవలె గట్టిపడి నిలిచింది. " దానిని పానం చేయి" అని విష్ణువు శివుని నియమించగా, శివుడు "దానిని భుజించడం నాకు సాధ్యం కాదే!' "అని అన్నాడు.

ఋగ్వేదంలో **"కేశీ విషస్య పాత్రేణ యత్ రుద్రేణాపిబత్ సహ"** అని చెప్పినట్లుగా, రుద్రుడనే పాత్రద్వారా భగవానుడు చేతిలో ఉండే విషాన్ని పానం చేసి, "మిగిలిన విషాన్ని పానం చేయి" అని శివుని నియమించగా, శివుడు "అచ్యుత, అనంత, గోవింద" నామాలను ఉచ్చరించి మిగిలిన విషాన్ని భుజించినట్లుగా పాద్మోత్తర పురాణంలోనూ, గారుడ పురాణంలోనూ చెప్పబడింది.

అందువల్ల, సముద్రమథన సమయంలో పుట్టిన విషాన్ని శివుడే పానం చేసినట్లు చెప్పబడడం చేత, అదే కారణంగా శివుడే పరుడు– అని చెప్పడం కూడా కేవలం అనుపపన్నమే కాగలదు.

# 8. యమగర్వభంగం

## పూర్వపక్షం

మార్కండేయ మహర్షిని చిరంజీవిగా చేయడం కోసం, శివుడు యమధర్మరాజును భంగపరిచాడు కనుక, శివుడే పరుడు – అని శైవులు అంటున్నారు.

## సిద్ధాంతమ్

"ప్రళయ కాలం వరకు యమునకు మరణం లేదు"– అని శ్రుతిలో చెప్పబడడం చేత, శివుడు, యమధర్మరాజును వధించాడు అనేది అసత్యమైన విషయం. చిరంజీవి పట్టాన్ని అనుగ్రహించడమే హేతువుగా పరత్వం చెప్పాలని చూస్తే, బలి, వ్యాసుడు, హనుమంతుడు, విభీషణుడు, కృపాచార్యుడు, పరశురాముడు– అనే వీరికి చిరంజీవిత్వం ఇచ్చినవారికికూడా పరత్వం చెప్పవలసి ఉంటుంది.

శ్రుతిలో, ప్రళయకాలంలో నారాయణునకు బ్రహ్మ, రుద్రుడు అన్నం, కూరగాయలు, ఊరగాయ స్థానంలో అవుతున్నారు – అని చెప్పబడినందున,

దేవతలు అసురులు జయించడం కోసం విష్ణువును ఉద్దేశించి, ఒక యాగాన్ని చేశారు, ఆ యాగంలో శివుని యజమానిగా పెట్టుకున్నారు, ఆ యాగం నుండి విష్ణువుయొక్క ఒక తేజస్సు, ధనుస్సు పుట్టగా, యాగ భాగమైన తేజస్సును దేవతలకు విభజించి ఇవ్వకుండా, శివుడే దానిని అపహరించాడు. దానిని చూసిన దేవతలు శివుని తేజస్సును తమకు కూడా విభజించి ఇవ్వమని అతనిని నిర్బంధించారు. శివుడు దానికి నిరాకరించి, యాగంలో పుట్టిన తేజస్సును తానే గ్రహించి, విష్ణువుయొక్క తేజోబలంతో దేవతలతో యుద్ధం చేయగా, దేవతలు ఆ యుద్ధంలో శివుని ముందు నిలువలేక పారిపోయారు. అప్పుడు శివుడు " ఇంద్రుడో, వరుణుడో, వాయువు, అగ్నియో, ఏ దేవత నాకు సాటి కాదు. మీరు పలువురు కలిసినా, నన్ను ఒకడను జయించడం సాధ్యం కాలేదు" అని గట్టిగా పలికి, దేవతలను పరిహసించాడు. అప్పుడు శివుని దగ్గర ఉండే విష్ణువు తేజస్సు శివుని చూచి " దేవతలకు యాగభాగం ఇవ్వకపోవడం నీ మొదటి తప్పు. దేవతలను వేళాకోళం చేయడం రెండవ తప్పు. నీ పరాక్రమాన్ని నీవే గొప్పగా చెప్పుకోవడం, అంటే, ఆత్మ ప్రశంస చేసుకోవడం మూడవ తప్పు. ఈ విధంగా ఈ మూడు తప్పుల వల్ల నీ దగ్గర నుండి ఉండలేక మేము వెళ్ళిపోతున్నాము" అని పలికి అతను నుండి తొలగిపోయింది. ఇంతకు ముందు తేజస్సు ఉన్న బలంచేత వంచిన ధనుస్సును శివుడు తన ఢొడభాగం కింద నిలుపుకొని, సుఖంతో నిలువగా, దేవతలు శివుని వధించడానికి ఇది తగిన సమయం అని ఆలోచించి. ఇంద్రుని ఒక ఏనుగు రూపాన్ని ఎత్తి, విల్లు కింది భాగంలో కట్టిన అల్లెతాడును విడదీయమని ప్రార్థించగా, ఇంద్రుడు కూడా ఆ విధంగానే చేశాడు. పట్టు వదిలిన అల్లెతాడు వేగంగా ఆకాశం వైపు వెళ్లేటప్పుడు, అది శివుని తలను ఖండించింది. తరువాత, పార్వతి తనకు మాంగల్యభిక్షను పెట్టమని ప్రార్థించగా, భగవానుడు ఇంకొక శిరస్సును ఇచ్చి, శివుని బ్రతికించినట్లు

వేదంలో, యజుర్వేద తైత్తిరీయ అరణ్యకంలో, బ్రహ్మమాత్స్య పురాణాలలోనూ చెప్పబడింది.

అంతేకాక, తైత్తిరీయోపనిషత్తులో, నరసింహ స్వామిని వధించాలని శరభరూపుడై వచ్చిన శివుని వధించిన హరిని దేవతలు అనుసరించారు – అని చెప్పబడింది.

ఈ విధంగా శ్రుతిలోని అనేక ప్రమాణాలలో శివుడు మరణించినట్లుగా చెప్పబడినప్పుడు, మరణాన్ని పొందే శివుడు మార్కండేయునకు మరణించకుండా ఉండే వరాన్ని ఇచ్చాడు – అని అనడం అసంగతం.

**“ఆరాధయన్ హృషీకేశం జిగ్యే మృత్యుం సుదుర్జయమ్”**

(హృషికేశుడైన భగవంతుని ఆరాధించి జయించడానికి సాధ్యం కాని మృత్యువును మార్కండేయుడు చేయించాడు) అని శ్రీభాగవతంలో చెప్పబడింది. “ నీవు ఇచ్చిన ఈ దీర్ఘమైన ఆయుస్సు నాకు కంఠానికి అవరోధమై, సంసార దుఃఖాలను అనుభవించడానికి పనికి వచ్చింది. సంసారం నుండి విడుదలను పొందేటట్లుగా మోక్షాన్ని నాకు అనుగ్రహించాలి” అని మహర్షి శివుని నిర్బంధించగా, “ మోక్షం ఇవ్వడం అనేది నావల్ల సాధ్యం కాని పని. అయినప్పటికీ నీవు మోక్షం పొందడానికి ఒక దారిని చూపిస్తాను, రా”, అని పలికి ఆ ఋషిని విష్ణువు దగ్గరకు తీసుకుని పోవడం పురాణాలలో చెప్పబడింది.

శివుడు యముని కాలితో తన్ని గర్వభంగాన్ని చేసి మార్కండేయుని చిరంజీవి చేసిన దానివల్ల శివుడే పరుడు– అనే ఈ వాదం దీనివల్ల ఖండింపబడినట్లు అయినది.

(మార్కండేయుడు శివుని వద్ద శ్రీవైకుంఠప్రాప్తి అనే మోక్షాన్ని అర్థించలేదు, దీర్ఘమైన ఆయుస్సును అర్థించాడు. కానీ, దానిని ఇవ్వడానికి యోగ్యత లేక, శివుడు మార్కండేయుని విష్ణువు దగ్గరకు అతనిని తీసుకొని

వెళ్లి, అతనిని విష్ణువును ఆశ్రయింప చేసి, ఆ భగవంతుని మూలంగా రక్షింప చేశాడు– అని

**"ఇండచ్చడైముడి ఈశనుడన్ కొండు ఉశా చ్చెల్ల"**

(తిరువాయ్ మొழி–7–5–7)

అనే చోట ఈడువ్యాఖ్యానంలో "మోక్ష ప్రదత్వాదిగుణాలను కూడా" అని ఉన్నందువల్ల తల్లిదండ్రుల కోరికను అనుసరించి దీర్ఘమైన ఆయుస్సును, తరువాత ఆత్మహితం కోసం మోక్షాన్ని ప్రార్థించినట్లును చెప్పవచ్చునని అంటారు.

# 9, 10. త్రిపుర సంహారమ్

## పూర్వపక్షం

ఇక్కడ పూర్వపక్షం ఈ విధంగా ఉన్నది. అసురుల త్రిపురాలను శివుడు దహించినందువల్ల త్రిపుర సంహారం చేసినప్పుడు, విష్ణువు వృషభరూపుడై, శివుని తేరును మోసినందువల్ల శివుడే పరుడని అంటున్నారు.

## సిద్ధాంతం

ఈ వృత్తాంతం కృష్ణయజుస్సంహిత, మహాభారతం, భాగవతం, పద్మపురాణం, హరివంశం మొదలైన గ్రంథాలలో కనిపిస్తున్నది.
దీని వివరం ఏమంటే,

పూర్వం ఒకానొక సమయంలో, తారకాసురుని పుత్రులైన తారకాక్షుడు, కమలాక్షుడు, విద్యున్మాలి అనే ముగ్గురు అసురులు బ్రహ్మను గూర్చి తీవ్రమైన తపస్సు చేసి, దాని ఫలంగా ఆకాశంలో ఎగుర గలిగినవి ఎవరికి నాశనం చేయడానికి సాధ్యం కానివి అయిన మూడు పురాలను వరంగా కోరారు. బ్రహ్మ కూడా వీరికి ఈ మూడు పురాలను వరంగా ఇచ్చి, ఆ మూడు పురాలు వేయి సంవత్సరాలకు ఒక మారు ఒకటిగా చేరుతాయి – అని, ఆ విధంగా ఒకటిగా చేరినప్పుడు ఒకే బాణంతో ఒక దేవశ్రేష్ఠుడు ఆ

మూడు పట్టణాలను నశింపజేస్తాడు అని, వేరు ఎవరి వల్ల ఏది ఏ విధమైన సమయంలోను వాటికి నాశనం లేదు – అని చెప్పి, అంతర్ధానం అయ్యాడు. ఈ మూడు పట్టణాలలో, ఇనుముతో చేయబడినది €భూమిలో సంచరించగలిగినది, వెండితో చేయబడినది– అంతరిక్షంలో సంచరించగలిగినది, బంగారంతో– చేయబడినది స్వర్గంలో సంచరించగలిగినది. ఈ మూడు, రాక్షసుల విశ్వకర్మ అయిన చేత నిర్మింపబడినవి. ఆ అసురులు, ఈ మూడు పట్టణాలలోనూ సంజీవి చిత్తరసకూపం అనబడే అమృతంతో నిండిన నూతిని నిర్మించి, గొప్ప వీర్యాన్ని కలిగిన పలువురు అసురులను ఏర్పాటు చేసి, తాము తలచిన చోట్లకు ఆ నగరాలతో పాటు ఎగిరి వెళ్లి, ఆయా చోట్లను నాశనం చేస్తూ వచ్చారు.

బ్రహ్మ ఇచ్చిన వరాల బలంచేత, వేదంపట్ల వారికి ఉండే ప్రామాణ్యబుద్ధిచేత, వారి స్త్రీలకు కల శీలగుణ ప్రభావంచేత, వారిని జయించడం దేవతలకు సాధ్యం కాలేదు. ఈ త్రిపురాసురులు కలిగించే క్లేశాలను సహించలేని దేవతలు, మునులు బ్రహ్మ దగ్గరకు వెళ్లి, తమను రక్షించమని మొర పెట్టారు. " వీరిని రుద్రుడే ఒకే బాణంతో వధించాలి, అందువల్ల అతనిని శరణు వేడండి" అని బ్రహ్మ అన్నాడు. అప్పుడు దేవతలు శివుని దగ్గరకు వెళ్లి ప్రార్థించగా, రుద్రుడు కూడా వారికి అభయాన్ని ఇచ్చి, ", దేవతలు తనకు పశుపతి పదం కలిగేటట్లుగా తనకు వరాన్ని ఇస్తే, అంటే, పశువులకు, పశుప్రాయులైన సంసారులకు, లేక, యాగపశువులకు అధిపతి కావడం– అనే వరాన్ని ఇస్తే, త్రిపుర సంహారం చేస్తాను– అని అన్నాడు. దేవతలుకూడా దానికి అంగీకరించినందు వల్ల, శివుడు దేవతలను పిలుచుకొని వెళ్లి, త్రిపురవాసులైన అసురులతో యుద్ధం చేసి, పలు అసురులను వధించాడు. అసురులు అమృతకూపంలో గెంటి వేయబడి, తిరిగి ప్రాణాలతో బయటపడి, యుద్ధం చేయడానికి మళ్ళీ వచ్చారు. శివుడు శ్రీమన్నారాయణుని గూర్చి అపుడు ఒక యాగం చేయగా, భగవానుడు శివుని

ముందు ప్రత్యక్షమై, త్రిపురాసురులను వధించే ఉపాయాన్ని చెప్పి, తాను కూడా సహాయంగా వస్తానని మాట ఇచ్చాడు. ఈ కథ యజుర్వేదంలోని ఆరవ కాండం, రెండవ ప్రశ్నలో ఉన్నది.

తరువాత, విష్ణువు ఒక పశువుగానూ, బ్రహ్మ దూడగాను త్రిపురాలలో ప్రవేశించి, అమృతకూపాలలో ఉండే అమృతాన్ని అంతటిని పానం చేశారు. ఈ కథ భాగవతంలో ఉంది. ఆ అసురులు వేదంలో చాలా ప్రామాణ్య బుద్ధిని కలిగినవారైనందువల్ల, విష్ణువు ఒక బుద్ధుని రూపంలో వారి ముందుకు వెళ్లి, మోహనాగమం అనే అసత్యమైన శాస్త్రాన్ని వారికి ఉపదేశించి, వేదంలో వారికి ఉండే నమ్మికను అంతటినీ పోగొట్టాడు. ఈ కథ పద్మపురాణం, హరివంశం అనే గ్రంథాలలో ఉన్నది. అసురుల వేదవిశ్వాసాన్ని భగవంతుడు ఈ రీతిలో పాడుచేయడం తగినదేనా?" అని అంటే, దుష్టులకు ధర్మరుచి ఉన్నట్లయితే అది, శిష్టులకు అనర్థంగా పర్యవసిస్తుంది కదా.

"ఉపోషితస్య వ్యాఘ్రస్య పారణం పశుమారణమ్" అనే విధంగా, పులి ఏకాదశీ వ్రతాన్ని చేస్తే, సాధువు అయిన గోవును వధించి తినడంతో కదా అది పూర్తి అవుతుంది. ఆ అసురుల భార్యలు శీల గుణాన్ని కలిగినవారు. పుత్రులను పొందాలని వారు కోరి ఉన్నారు. భగవానుడు వారి వద్దకు వెళ్లి, " మీరు పుత్రసంతానాన్ని పొందాలని కోరినట్లయితే, అశ్వత్థవృక్షాన్ని పూజించి, దానిని ఆలింగనం చేసుకొన్నట్లయితే, పుత్రులను మీరు పొందుతారు" అని చెప్పగా, వారుకూడా ఆ విధంగానే చేశారు. భగవానుడు స్వయంగా రావిచెట్టు రూపంలో ఆవిర్భవించి వారి శీలగుణాన్ని పాడు చేశాడు ఆ తరువాత, భగవానుడు శివునితో, భూమిని తేరుగాను, సూర్యచంద్రులను ఆ తేరుకు చక్రాలుగాను, వేదాలను గుర్రాలుగానూ, బ్రహ్మను సారథిగాను, మేరు పర్వతాన్ని విల్లుగాను చేసుకొని, అసురులను వధించమని చెప్పాడు.

భగవానుడైన శ్రీమన్నారాయణుడే శివునకు అంతర్యామిగా ఉండి, బాణంలో తానే ఉండి, శివునకు విల్లును, బాణాన్ని ధరించే శక్తినికూడా

ఇచ్చాడు. ఇక్కడ మహాభారతంలో వ్యాసమహర్షి అనుగ్రహించిన శ్లోకాన్ని గమనించండి.

**“విష్ణురాత్మా భగవతో భవస్యామితతేజసః,**

**తస్మాత్ ధనుర్జ్యా సంసర్గం స విషేహే మహేశ్వరః”**

(గొప్ప తేజస్సును కలిగిన రుద్రునకు, త్రిపురాలను దహించిన కాలంలో విష్ణువు విశేషించి ఆత్మ అయి ఉన్నాడు. అందువల్లనే మహేశ్వరుడు ఆ విల్లును, బాణాన్ని తాకలిగాడు)

శ్రీమన్నారాయణుడు శివునకు బ్రహ్మను పురస్కరించుకొని “హరి పంజరం”, అనే మంత్రాన్ని ఉపదేశించి త్రిపురాలను శివుడు నశింప చేసేటట్లు చేశాడు. ఈ విషయం నారదీయంలో ఉన్నది. త్రిపురాసురులతో యుద్ధం చేయడంలో రథచక్రం భగ్నమై, క్రింద పడిపోవడానికి సిద్ధం కాగా, భగవానుడు ఒక వృక్షమై ఆ రథాన్ని వహించాడు. త్రిపురాలు జయించిన తరువాత, దేవతలు, మునులు, శంకరుడు, బ్రహ్మతో పాటు కూడినవారై పురుషోత్తముని స్తుతించారు. ఈ విషయం హరివంశంలో ఉన్నది.

ఈ వృత్తాంతాలనుబట్టి, విష్ణువే త్రిపుర సంహారానికి పలు ఉపాయాలను చెప్పి, శివుని నిమిత్తమాత్రంగా గ్రహించి, తానే పలు కార్యాలను చేసి, శివునకు త్రిపురారి అనే కీర్తిని సంపాదించి ఇచ్చాడు.

భూమి, హిరణ్యాక్షుని చేత సముద్రంలో ముంచబడి, ఆపదను పొందినప్పుడు, వరాహమై భూమిని ధరించి మళ్ళీ పైకి తీసుకుని వచ్చి, మందరపర్వతం సముద్రంలో మునిగిపోయేటప్పుడు, దానిని కూర్మరూపాన్ని ధరించి మోసి, ఈ విధంగా ఆపద సమయాలలో రక్షించడాన్నే వ్రతంగా కలిగి ఉండే శ్రీమన్నారాయణుడు, త్రిపురసంహార సమయంలో కూడా రథచక్రం విరిగిపోయినప్పుడు, ఆ రథాన్ని వృషభంగా మోయడం శివునకు ఏ విధంగా కూడా గొప్పతనాన్ని కలిగించదు, కనుక,

- రుద్రుని అంశగా చెప్పబడే హనుమంతుడు రామలక్ష్మణులను తన భుజాలపై మోయడం వల్ల,
- శివుని రథాన్ని విష్ణువు వృక్షరూపాన్ని ధరించి భరించినందు వల్ల,
- శివుడే గొప్పవాడు అని వాదించడం అబద్ధం – అని అన్నట్లయినది.

విష్ణువు, వృషభ రూపాన్ని ధరించిన కారణంచేతనే శివునకు వృషభవాహనం ఏర్పడింది – అనేది కూడా పిచ్చి మాటే. భగవానునకు గరుడుడు, ఇంద్రునకు ఐరావతం, యమునకు ఎనుబోతు వాహనంగా ఉండేటట్లుగా, శివునకు వృషభం వాహనంగా ఎల్లప్పుడూ ఉన్నందువల్ల, ఈ హేతువుచేత శివునకు వృషభం వాహనంగా ఏర్పడింది అనేది అపహాస్యమే అయినది.

## 11. దక్షయజ్ఞం

### పూర్వపక్షం

ఇక్కడ పూర్వపక్ష వాదం ఈ విధంగా ఉన్నది. దక్షప్రజాపతి తాను చేసిన యాగానికి శివుని పిలువనందున, శివునకు చెందిన హవిర్భాగాన్ని ఇవ్వనందువల్ల, కోపాన్ని పొందిన శివుడు, తన పాలనేత్రనుండి వీరభద్రుని సృష్టించి, అతని మూలంగా దక్షుడు తలను తరగడం, యాగాన్ని ధ్వంసం చేయడం, యాగానికి వచ్చిన విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలను జయించడం మొదలైన కారణాల వల్ల శివుడే పరుడు – అని వాదిస్తారు.

### సిద్ధాంతం–

దక్షయజ్ఞాన్నిగూర్చి తెలియజేసే భాగవతంలో దక్షప్రజాపతి చేసిన యాగానికి విష్ణువు వచ్చినట్లుగా శుకమహర్షి చేత చెప్పబడలేదు. ఇతర పురాణాలలో చెప్పబడి ఉంటే, అది సాత్విక పురాణానికి విరుద్ధం కనుక ప్రమాణం కాబోదు. విష్ణువును గూర్చి చేయబడిన దక్షయాగాన్ని చివరిలో శివుడే పూర్తిచేసి, విష్ణువును, బ్రహ్మను నమస్కరించినట్లుగా చెప్పబడినది.

దక్షుడు తన కుమార్తె సతీదేవిని శివునకు ఇచ్చి వివాహం చేశాడు. ఇంద్రుడు చేసిన యాగానికి దక్షుడు, శివుడు వచ్చినప్పుడు, దక్షుడు తాను శివునకు మామగారు అయినందువల్ల, అల్లుడైన శివుడు తనను నమస్కరించాలి – అని ఎదురుచూశాడు శివుడు నమస్కరించకపోగా, తనను అతడు అవమానించినట్లుగా దక్షుడు భావించాడు. కోపంలో శివునకు యాగంలో హవిర్భాగం లేకుండా పోవాలని, స్మశానంలో శివుడు నివసిస్తాడని, అతడు భూతప్రేత పిశాచాలకు నాయకుడై ఉంటాడని శపించాడు.

తాను విష్ణువును ఉద్దేశించి చేసిన యాగానికి బ్రహ్మ ఇంద్రాది దేవతలను పిలిచిన దక్షుడు, శివుని మాత్రం పిలువలేదు. ఈ విషయాన్ని విన్న అతని కుమార్తె సతీదేవి ఆ విషయాన్ని గూర్చి ప్రశ్నించడానికి రాగా, దక్షుడు ఆమెను అవమానించి తిప్పి పంపాడు. అవమానింపబడి తిరిగి వచ్చిన సతీదేవిని, శివుడు కోపంలో వధించాడు. భార్యను పోగొట్టుకున్న కోపంతో శివుడు తన నుదుటి భాగంలో ఉండే కంటినుండి వీరభద్రుని సృష్టించి, దక్షుడు చేసే యాగాన్ని, ఆ యాగానికి వచ్చినవారిని వధించమని అతనిని పంపాడు. వీరభద్రుడు దక్షుని తలను తరిగి, యాగాన్ని పాడుచేసి, యాగానికి వచ్చిన దేవతలను హింసించాడు. ఈ విధంగా యాగం పాడయిన తర్వాత, బ్రహ్మ ఇంద్రాది దేవతలు యాగశాలకు వచ్చి, అక్కడ మృతశరీరుడై ఉండే దక్షప్రజాపతికి వేరొక శిరస్సును ఇచ్చి, బ్రతికించి లేపి, అతడిచ్చిన శాపాలను ఉపసంహరింప చేసికొమ్మని అడిగారు. శివునకు యాగంలో హవిర్భాగాన్ని ఇచ్చేటట్లు దక్షుని ప్రార్థించి, ఆ దక్షప్రజాపతిని మళ్ళీ స్నానం చేయించి, అతనిచే యాగాన్ని పూర్తి చేయించారు. ఆ యాగంలో పూర్ణాహుతి సమయంలో విష్ణువు అక్కడకు వచ్చి, దక్షుడు కోరిన ఫలాన్ని ప్రసాదించి, తిరిగి వెళ్లినట్లుగా శ్రీభాగవతంలో చెప్పబడింది.

వేదంలో, ప్రళయ కాలంలో విష్ణువునకు బ్రహ్మారుద్రులు అన్నంగా, ఉపదంశంగా అవుతారని చెప్పబడింది. వేదం అనుసంధానం చేయబడేటప్పుడు, మొదట చివర "హరిః ఓమ్" అని చెప్పబడుతున్నది. "హరిః" అనే పదానికి సహస్రనామభాష్యంలో, బ్రహ్మారుద్రాది దేవతలను కల్పాంతంలో విష్ణువు హరించే కారణంచేత, ఆ స్వామికి హరి అనే నామం కలిగిందని చెప్పబడింది.

**"బ్రహ్మాణమింద్రం రుద్రం చ యమం వరుణమేవ చ, నిగృహ్యా హరతే యస్మాత్ తస్మాత్ హరి రిహోచ్యతే"**

(ప్రళయ సమయంలో బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడు, యముడు, వరుణుడు మొదలైనవారిని బలాత్కారంగా సంహరిస్తున్న కారణంచేత, విష్ణువు హరి అని చెప్పబడుతున్నాడు) అనే పౌరాణిక ప్రమాణం అక్కడ చూపబడింది.

విష్ణువు, దక్షుని యాగానికి మొదట వచ్చి ఉంటే, అతడు వీరభద్రుని సంహరించి ఉండేవాడు.

ఈ కారణాల వల్ల, "దక్షయాగాన్ని పాడు చేసినందున శివుడే పరుడు" అని వాదించేవారి వాదం ఖండింపబడినట్లయినది.

# 12. పాశుపతాస్త్రం

## పూర్వపక్షం

అభిమన్యువు మరణానికి కారణమైన జయద్రథుని చంపడానికి అర్జునుని కృష్ణుడు శివుని దగ్గరకు తీసుకొని వెళ్లి కదా, పాశుపతాస్త్రం ఇప్పించాడు. తనకు శక్తి ఉంటే, తానే సైంధవుని సంహరించవచ్చు కదా. అందువల్ల శివుడే పరుడు – అని శైవులు వాదిస్తారు.

## సిద్ధాంతం

అర్జునుడు శివ పూజను చేసేవాడు. గీతోపదేశాన్ని విన్నా, విశ్వరూపాన్ని చూసినా, తెలివిని పొందకుండా అభిమన్యువు చనిపోయిన ఆనాటి రాత్రి " లింగపూజను చేయకుండా ఉండలేను, భుజించను" – అని ఉపవాసం ఉన్నాడు. "జయద్రథుని మరునాడు సూర్యుడు అస్తమించేలోగా వధిస్తాను" – అని శపథం చేశాడు. అప్పుడు ఈ కృష్ణుడు అర్జునుని చూచి, "జయద్రథుడు పాశుపతాస్త్రంతో తప్ప, వేరొక దేనివల్ల చావడు. నీకు ఆ అస్త్రం ప్రయోగించడం తెలుసా?" అని అడిగాడు. అప్పుడు అర్జునుడు "దానిని మరచిపోయాను, దానిని శివుని ఆరాధించి, దానిని పొందుతాను" అని పలికాడు. కాని, "శివుని ఆరాధించడానికి శివలింగం లేదే !" అని అతడు బాధపడ్డాడు. అప్పుడు శ్రీకృష్ణుడు " ఏ ఏ పుష్పాలతో శివుని ఆరాధించాలని నీవు అనుకుంటున్నావో, ఆ పుష్పాలతో నా పాదాలలో అర్చించినట్లయితే, శివుడు నీకు స్వప్నంలో కనుపించి, పాశుపత మంత్రాన్ని ఉపదేశిస్తాడు" అని అన్నాడు. అప్పుడు అర్జునుడు శ్రీకృష్ణుని పాదాలలో పుష్పాలను సమర్పించి ఆరాధించగా, ఆ నాటి రాత్రి అర్జునునకు కలలో శివుడు కనిపించి, కృష్ణుని పాదాలలో అర్జునుడు ఆరాధించిన పుష్పాలను తన శిరస్సులో ధరించిన రూపంతోనే దర్శనాన్ని ఇచ్చి, పాశుపత మంత్రాన్ని ఉపదేశించాడు– అని భారతంలో తెలుపబడింది.

దీనిని పురాణం,

**"పార్థోపనీతం మధుసూదనస్య**
**పాదారవిందార్పిత చిత్రపుష్పమ్,**
**తతశ్చ గంగాధరమౌలిమధ్యే**
**బభూవ వీరః కృతనిశ్చయార్థః"**

(అర్జునుడు, మధుసూదనుడు అయిన శ్రీకృష్ణుని పాదారవిందాలలో సమర్పించిన అనేక విధాలైన పుష్పాలను గంగాధరుని శిరస్సు మధ్యలో చూశాడు. దానివల్ల ఆ వీరుడు కృష్ణుడే పరదైవం అనే అర్థాన్ని నిర్ణయించుకొన్నవాడు అయ్యాడు) అని తెలిపింది. జ్ఞాని అయిన అర్జునుడు నిశ్చయించుకున్న తరువాత, శివుడు అతనికి పాశుపత మంత్రాన్ని ఇచ్చినందున, అటువంటి శివునకు ఒక మాహాత్మ్యాన్ని చెప్పేవారు అల్పజ్ఞానులే అవుతారు కదా.

# 13. శరభవధ

## పూర్వపక్షం

నరసింహుని శివుడు శరభరూపియై జయించి వధించాడు కనుక, శివుడే పరుడు– అనేది ఇక్కడ పూర్వపక్షం.

## సిద్ధాంతం

నృసింహస్వామి ఆవిర్భావం (ఈడు వ్యాఖ్యానంలో –2–8–9) తటాలున సంభవించినప్పుడు, ఆ రూపం అట్టహాసంతో నాలుక మడచిన ఠౌడతో, నుదుటిలో నేత్రంతో ఆవిర్భవించింది ఆ నరసింహస్వామి తేజస్సులో హిరణ్యకశిపుని అంత పెద్ద శరీరం, నిప్పులో మగ్గిపోయిన పంది శరీరం వలె అయినది. " అవన్ వీయ త్తోన్రియ శింగప్పిరాన్" (ఆ హిరణ్యకశిపుడు నశించేటట్లుగా ఆవిర్భవించిన నృసింహస్వామి) అని ఆళ్వారులు చెప్పినట్లుగా, నృసింహుని ఆవిర్భావంలో హిరణ్యకశిపుడు శవకల్పుడు అయ్యాడు. ఆ తరువాత కేవలం అతని మృతశరీరాన్ని మాత్రమే స్వామి చీల్చివేశాడు.
శ్రీనరసింహ స్వామి ఆవిర్భావ దృశ్యాన్ని కూరేశులు సుందర బాహుస్తవంలోని 95వ శ్లోకంలో,

**న వాయుః పస్పందే యయతు రథ వాస్తం శశిరవీ**
**దిశో నశ్యన్ విశ్వాప్యచలదచలా సాచలకులా,**

**నభశ్చ ప్రశ్చ్యోతి క్వథితమపి పాథో నరహరౌ**
**త్వయి స్తంభే శుంభద్వపుషి సతి హే సుందరభుజ!.**

(ఓ సుందర బాహుస్వామీ! నీవు నరసింహ రూపాన్ని ధరించి హిరణ్యుని గృహంలోని స్తంభంనుండి ఆవిర్భవించిన సమయంలో, వాయువు స్తంభించిపోయింది. చంద్రసూర్యులు అస్తమించిపోయారు. దిక్కులు గుర్తించటానికి లేకుండా అయిపోయాయి. పర్వతాలతో కూడిన భూమి అదిరిపోయింది. సముద్రంలోని నీరు సలసల కాగిపోయింది. ఆకాశం సముద్రంలో మునిగిపోయినట్లుగా తోచింది) అని స్తుతించారు.

ఇటువంటి దివ్యరూపంతో భగవానుడు నరసింహుడై అవతరించి, హిరణ్యకశిపుని వధించినా, చాలా కోపంతో ఉన్న నృసింహస్వామిని చూసిన దేవతలు, మునులు శివుని దగ్గరకు వెళ్లి మొరపెట్టుకున్నారు అప్పుడు శివుడు కూడా శరభమృగ రూపాన్ని ధరించి, నరసింహునితో యుద్ధం చేయడానికి ప్రారంభించాడు. శరభరూపాన్ని ధరించిన ఆ శంకరునికూడా నృసింహస్వామి సంహరించడాన్ని చూసిన దేవతలు మునులతో కలసి ఆ స్వామి దగ్గరకు వెళ్లి, బ్రహ్మను శరణు వేడగా, బ్రహ్మ వారితో కలసి లక్ష్మీదేవిని శరణు పొందాడు. అప్పుడు, లక్ష్మీదేవి కూడా వారితో కలిసి, నరసింహుని దగ్గరకు రాగా, లక్ష్మీదేవిని చూచిన నృసింహుని కోపం తగ్గినట్లు, దీనిని తెలుసుకున్న పార్వతీదేవి భగవంతుని ప్రార్థించి, స్తుతించి తన మాంగల్యాన్ని రక్షించమని వేడగా, పార్వతి దేవికి దయచూపి భగవానుడు కూడా శివుని మళ్లీ సజీవుని చేసినట్లుగా ఉండే వృత్తాంతం వామన పురాణం, ఆదిత్య పురాణం, గారుడం, ఆగ్నేయ పురాణం, నరసింహ పురాణం, భాగవత పురాణాలలో చెప్పబడింది.

తైత్తిరీయ అరణ్యకం, మూడవ ప్రశ్న 15వ అనువాకం ఆరంభంలో ఉండే మంత్రం ఈ విధంగా ఉన్నది –

**"హరిం హరంత మనుయంతి దేవాః**

**విశ్వస్య ఈశానం వృషభం మునీనామ్"**

ఈ మంత్రానికి శైవులు చెప్పే అర్థం ఏమంటే,

హరిం =సింహరూపంలో ఉండే విష్ణువును, హరంతం =సంహరించేవాడు, విశ్వస్య= లోకానికి, ఈశానం =ఈశ్వరుడు, మునీనాం వృషభం = జ్ఞానులలో చాలా గొప్పవాడు అయిన శివుని, దేవా =దేవతలు, అనుయంతి = అనుసరిస్తున్నారు.

ఈ అర్థంలో రెండు దోషాలు ఉన్నాయి.

మొదటి దోషం ఏమంటే, పదాలను సమానాధికరణాలుగా, (ఒకే విభక్తిని కలిగినవిగా,)? గ్రహించే అవకాశం ఉండేటప్పుడు, (వ్యధికరణాలుగా, వేరు వేరు విభక్తులను కలిగినవిగా, ) గ్రహించడం న్యాయం కాదు. దీనిని సంస్కృతభాషా శాస్త్రజ్ఞులు అందరూ అంగీకరించిన విషయం. అందువల్ల పైన తెలిపిన మంత్రంలోని అర్థం ఏమంటే,

హరంతం = బ్రహ్మరుద్రాది దేవతలు అందరిని సంహరించేవాడు, విశ్వస్య ఈశానం = లోకానికి ఈశ్వరుడు, మునీనాం వృషభం = జ్ఞానులలో గొప్పవాడు అయిన, హరిం = హరిని, దేవాః అనుయంతి = దేవతలు అనుసరిస్తున్నారు.

**"బ్రహ్మాణమింద్రం రుద్రం చ యమం వరుణమేవ చ,**
**నిగృహ్య హరతే యస్మాత్ తస్మాత్ హరి రిహోచ్యతే"**

(ప్రళయ సమయంలో బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడు, యముడు, వరుణుడు మొదలైనవారిని బలాత్కారంగా సంహరిస్తున్న కారణంచేత విష్ణువు హరి అని చెప్పబడుతున్నాడు) అనే ప్రసిద్ధప్రమాణం దీనిని ఉపబృంహణం చేస్తున్నది.

ఇక్కడ హరిశబ్దంతో నరసింహుని గ్రహించాలి – అని అంటే, హరంతం = హిరణ్యకశిపుని, శరభుని సంహరించేవాడైన, హరిం =

నరసింహుని అనే అర్థం గ్రహించడమే ముందు తెలిపిన న్యాయానికి తగినది. శైవులు చెప్పే అర్థం శ్రుతి, స్మృతి, ఇతిహాస పురాణ వచనాలకు విరుద్ధమైనది.

**"తమభ్యాగతం దృష్ట్వా నృసింహః శరభం రుషా,**
**జఘాన నిశితై రుగ్రైః నఖైః నఖవరాయుధః"**

(మిక్కిలి కోపంతో నృసింహస్వామి, శరభాన్ని, బలం మిక్కిలిగా కలిగిన గోళ్ళు అనే ఆయుధాలతో చీల్చివేశాడు) అని అగ్నిపురాణం తెలుపుతున్నది.

ఇక, రెండవ దోషం ఏమంటే, ఈ మంత్రంలో శివుని తెలిపే పదం కాని, శరభాన్ని నిర్దేశించే పదం కానీ, ఏమీ లేదు. అందువల్ల శరభ కథను ఈ వేదవాక్యం తెలుపదు. " ఈశానమ్ " అనే పదం రూఢిచేత శివుని తెలుపుతుంది కదా! అని అంటే, ఇక్కడ ఈశాన శబ్దం ప్రత్యేకంగా లేదు. "విశ్వస్య ఈశానమ్" అని ఉపపదంతో కూడి ఉన్నది. అందుచేత రూఢిభంగాన్ని పొందుతున్నది. ఈశానశబ్దాన్ని మాత్రం ప్రయోగిస్తే కర్మవశ్యుడైన శివుని చెబుతుందని భావిస్తారు – అని "పతిం విశ్వస్య ఆత్మేశ్వరం నారాయణమ్" అని నారాయణవల్లిలో లోకేశ్వరునిగా చెప్పబడే నారాయణుడే ఇతడు – అని "విశ్వస్య ఈశానం" అనే పదం తెలియజేస్తున్నది. ఈ రెండు దోషాల వల్ల ఇక్కడ శైవులు చెప్పే అర్థం ఎంత మాత్రం పొసగదు.

**"ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతో ముఖమ్, నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్"**

**(నృసింహ మంత్రం)**

(ఉగ్రమైనవాడు, వీరుడు, మహావిష్ణువు, జ్వలించేవాడు, అంతటా ముఖాలను కలిగినవాడు, నరసింహుడు, భయంకరమైనవాడు,

అందమైనవాడు మృత్యువుకుకూడా మృత్యువైనవానిని నమస్కరిస్తున్నాను) అనేది నరసింహమంత్రం.

"మృత్యు మృత్యుమ్" అని కీర్తింపబడే నరసింహుని శివుడు సంహరించాడు – అని అనడం పురాణ వచనాలకు విరుద్ధం కనుక, హారీతస్మృతిలో "నరసింహ సనాతనః" (నరసింహుడు ఎల్లప్పుడూ ఉండేవాడు) అని ఘోషింపబడినందున కూడా, శైవుల వాదం పొసగదు.

మాత్స్యం, కౌర్మం తథా లైంగం శైవం స్కాందం తథైవ చ, ఆగ్నేయం చ షడేతాని తామసాని నిబోధ మే"

**(పాద్మోత్తరఖండం)**

(మత్స్య పురాణం, కూర్మపురాణం, లింగ పురాణం, శైవపురాణం, స్కాంద పురాణం, ఆగ్నిపురాణం– అనే ఆరు పురాణాలు తామసపురాణాలుగా గ్రహించు) అని చెప్పబడినందున, శివుడు శరభమై నరసింహుని వధించాడు – అనేది ఏ ఆధారం లేని కట్టుకథ – అనే చెప్పాలి. స్కాంద పురాణం తామస పురాణం కదా

## 14. శాస్తా జన్మ

**పూర్వపక్షం –**

విష్ణువు మోహినీ రూపాన్ని ధరించినప్పుడు, శివుడు అతనితో కలిసిన సమయంలో శాస్త పుట్టాడు, కనుక, శివుడే పరుడు – అని శైవులు వాదిస్తారు.

**సిద్ధాంతమ్**

పాలసముద్రాన్ని చిలికినప్పుడు లభించిన అమృతాన్ని దేవతలకు మాత్రం విభాగించి ఇవ్వాలని తలచిన విష్ణు భగవానుడు, అసురులు మోహాన్ని పొందడం కోసం మోహినీ వేషాన్ని ధరించి, దేవతలను వేరువేరుగా కూర్చోమని చెప్పి, మొదట దేవతలకు అమృతాన్ని విభజించి ఇచ్చాడు. అసురులకు అమృతాన్ని ఇవ్వకుండా మభ్య పెట్టాడు. ఆ విధంగా విష్ణువు

మోహినీ వేషాన్ని ధరించి, అమృతాన్ని విభాగించి ఇచ్చేటప్పుడు శివుడు హాలాహల విషపానం చేసినందువల్ల, మోహాన్ని పొంది ఉన్నాడు. మరునాడు విష్ణువు మోహినీవేషాన్ని ధరించి వృత్తాంతాన్ని విని, విష్ణువును కీర్తించి, తాను ఆ మోహినీ వేషాన్ని సేవించాలి – అని ప్రార్థించగా, అప్పుడు విష్ణువు "నీవు తామసుడవు కనుక, ఆ వేషాన్ని చూచి, భరించలేవు" అని అన్నాడు. కానీ, శివుడు నిర్బంధించగా, అప్పుడు విష్ణువు తన మాయతో ఒక ఉద్యానవనాన్ని సృష్టించి, అందులో సంచరించే ఒక స్త్రీగా కనిపించాడు. శివుడు ఆమెను చూచినంతమాత్రంలోనే, ఎండమావులలో నీరు ఉందని భ్రమించి పరిగెత్తే లేడివలె, ఆ స్త్రీని వెంబడించాడు. ఆ స్త్రీ కొంచెం దూరం వెళ్లి, తరువాత తటాలున మాయమైనది. అప్పుడు, శివునకు రేతస్సు జారిపడి, తొడద్వారా కారి, చిటికెన వేలులో ప్రవహించినప్పుడు, శాస్త్ర జన్మించాడు – అని ఆగ్నేయ పురాణంలోనూ, వాయు పురాణంలోనూ చెప్పబడింది, స్త్రీపురుష సంయోగం లేకుండా బిడ్డ జన్మించే అవకాశం ఉన్నదా? అని అంటే, బ్రహ్మ మేఖలను సృష్టించేటప్పుడు, తనచే సృష్టింపబడినది అనే సంగతిని మరచిపోయి, ఆమెను చూసి మోహించాడు. అపుడు అతని రేతస్సు జారి, అతని కుడిపాదంలో జారగా, అది 60 వేల బిందువులై వాలఖిల్య ఋషులు జన్మించారు– అని ఇక్ష్వాకు వంశంలో, యువనాశ్వుడు యాగం చేసి మంత్రపూతమైన జలాన్ని పొరపాటున తాగగా, అతని కడుపున గర్భం ఏర్పడి, మాంధాత అనేవాడు జన్మించాడు– అని పురాణాలలో చెప్పబడినది కదా.

అందువల్ల శివునకు మోహిని అనే స్త్రీతో సంగమం కలిగినందున శాస్త పుట్టాడు– అని తామసపురాణాలలో చెప్పబడినా, అది సాత్విక పురాణాలతో విరోధిస్తున్నందున, ఈ తామస పురాణాల కథనం ప్రమాణం కాబోదు. బ్రహ్మ మొదలు పిపీలిక వరకు ఉండే ప్రాణులు అన్నీ విష్ణు మాయచేత మోహాన్ని పొంది వర్తిస్తున్నాయి – అని చెప్పిన విధంగా విష్ణువును చూచి మోహాన్ని పొందిన శివుడు పరుడు అని చెప్పడం చాలా అసమంజసం.

**"పెణ్ణాకి ఇన్నముదమ్ వంజిత్తానై"** (పెరియ తిరుమొழி–2–5–8)
(మోహినీరూపాన్ని ధరించినవాడై, అసురులను మభ్యపెట్టి, అమృతాన్ని దేవతలకు అనుగ్రహించినవానిని) అని తిరుమంగై మన్నన్ అని చెప్పిన విధంగా, పురుషోత్తముడే మోహినీ వేషాన్ని ధరించాడు– అనే విషయాన్ని కూడా తెలియలేనివాడై, విటపురుషునివలె స్త్రీని చూచిన వెంటనే శివుని రేతస్సు బహిర్గతమైనది– అంటే, శివుడు కామ క్రోధాదులకు పశపడిన ఒక సంసారి జీవుడే – అనే విషయాన్ని లోకానికి తెలుపడం కోసమే విష్ణువు ఆడిన నాటకం, ఇది.

అప్పర్, తేవారంలోని ఒక పాశురంలో, " అరియల్లాల్ దేవియిల్లై ఐయన్ ఐయారణార్ క్కే" – మోహినిని చూచిన వెంటనే శివుని రేతస్సు బయటపడి అయ్యప్పన్ పుట్టినందున, శివునకు విష్ణువు దేవి అయ్యాడు. దేవి అయిన విష్ణువు కంటే, దేవుడు అయిన శివుడు గొప్పతనాన్ని ఎక్కువ కలిగినవాడు– అనే అర్థం వచ్చేటట్లు పాడారు.

ఒకానొక సమయంలో నంజీయర్, నంబిళ్ళైను తిరువైయ్యాఱు వెళ్లి, మాధవ రాయుడు అనే ప్రభువు దగ్గర మాన్యం పొందమని నియమించగా, నంబిళ్ళై తన గోష్ఠితో కలసి తిరువయ్యాఱు వెళ్ళగా, అక్కడ వీరిని పలువురు నమస్కరించి గౌరవించడాన్ని చూచి, వీరిని గూర్చి విచారించిన ఒక శైవుడు, వీరి గొప్పతనాన్ని, తమిళంలో వీరి పాండిత్యాన్ని విని, వీరి నోటితో శివునకు ఒక గొప్పతనం కలిగేటట్లు చేయాలనే భావంతో, నంబిళ్ళై దగ్గరకు వెళ్లి, "స్వామీ! మీరు తమిళంలో విశేషమైన పాండిత్యాన్ని కలవారు అని విన్నాను. నాయన్మార్లు మా దేవుని "అరియల్లాల్ దేవి యిల్లై" అని పాడారు. దీనికి అర్థం ఏమో, మీరు చెప్పాలి " అని అనగా, నఃబిళ్ళై " దానిని నేను చదవలేదు" అని చెప్పినప్పటికీ, శైవులు నంబిళ్లైను దానికి అర్థం చెప్పమని నిర్బంధించగా, తరువాత నంబిళ్ళై, " "విష్ణువే పురుషోత్తముడు " అని పురాణాలలో చెప్పబడి ఉండగా, ఆశ్రితార్థంగా అతడు తన రూపాన్ని మార్చుకున్నాడు– అని అంటే,

అది అతనికి గుణం అవుతుందే తప్ప, దోషం కాబోదు. ఇక, స్త్రీ రూపాన్ని ధరించిన పురుషుని చూచి, అతనిని స్త్రీ అని భ్రమించి, వెంటపడేవారివలె, శివుడు వెంటపడితిరిగాడు అని శివుని అజ్ఞుని చేయడం కంటే, ఈ విషయాన్ని చెప్పినవాడు అనాప్తుడు, అజ్ఞుడు అని అనడం మంచిది కదా"– అని అన్నారు. తనిశ్లోక వ్యాఖ్యానంలో " ఆణ్ పిళ్ళై శొற்றாழவి" (ఆణ్ పిళ్ళై – తక్కువవాడు) అనే పదప్రయోగం, దానికి, " పైన స్త్రీగా, లోపల పురుషుడుగా ఉండే స్త్రీపురుష కలయికను చూచి, లోకంలో ఉండేవారు నపుంసకుడు– అని భావిస్తారు" అనే వివరణం కనబడుతూ ఉన్నది. నపుంసకుని చూచి, అతనిని స్త్రీ అని భావించి, వెంటపడేవారివలె, స్త్రీవేషాన్ని ధరించిన పురుషోత్తముని చూచి, శివుడు అతనిని స్త్రీగా భావించి, వెంటపడ్డాడు– అని అనడం శివుని అజ్ఞుడనే తెలుపుతుంది. ఈ విధంగా మీరు మీ దేవతను అజ్ఞుడని అని అనడం కంటే, ఈ విధంగా వ్రాసినవానినే ఆజ్ఞుడు– అని అనడమే తగునుకదా – అని పై వివరణలోని భావం.

## 20. వ్యాసుని భుజం స్తంభించడం

### పూర్వపక్షం

కాశీనగరంలో వ్యాసుడు "నారాయణుడే పరుడు "అని తన బాహువులను పైకెత్తి చెప్పినప్పుడు, అతని భుజాలు స్తంభీభూతాలు అయినందువల్ల, శివుడే పరుడు – అని శైవులు అంటారు.

### సిద్ధాంతమ్

ప్రతికల్పంలోనూ వేదంలోని యథార్థాన్ని స్థాపించడం కోసం, దానికి మారుగా ఉండే అర్థాలను నిరాకరించడం కోసం భగవానుడు ఒకరిని వ్యాసపదంలో ఉండేటట్లు నియమించి, అతనిలో తన అధిష్ఠానం అనే ఆవేశాన్ని అనుగ్రహిస్తాడు. ఈ విధంగా నియమించబడిన వ్యాసుడు వేదంలో చెప్పబడిన అర్థాలను, అంటే, ప్రతికల్పంలోనూ బ్రహ్మ, రుద్రుడు

విష్ణువునుండి జనిస్తున్నారు, వారికి అంతర్యామి అయినవాడు శ్రీమన్నారాయణుడే. ప్రతికల్పం చివరిలో వీరు విష్ణువుచేత సంహరింపబడుతున్నారు. నారాయణడు ఒక్కడే చివరిలో మిగిలి ఉంటాడు. నారాయణుడే పరబ్రహ్మం– అని వేదంలో అధ్యయనం చేయబడిన అర్థాలను లోకంలో పండిత పామరులు అందరూ తెలిసే విధంగా, కాశీలో గంగలో స్నానం చేసి, తడి వస్త్రంతో ఊర్ధ్వపుండ్రాన్ని ధరించి, " భూదేవి, అంతరిక్షాల సాక్షిగా నేను ప్రమాణం చేసి చెబుతున్నాను. ఉపనిషత్తులలో యథార్థంగా చెప్పబడిన అర్థాన్ని మూడుసార్లు సత్య ప్రమాణం చేస్తున్నాను. వేదానికి మించిన శాస్త్రం లేదు. కేశవునకు మించినవాడైన దైవం వేరొకడు లేడు" అని ప్రతిజ్ఞను చేయగా, అప్పుడు, నంది ఇతడు యథార్థాన్ని చెబుతున్నాడు– అని సంతోషించకుండా, తామసగుణంతో వ్యాసుని హింసించాలని వచ్చినపుడు, హనుమంతుడు నందిని చూచి, తన ఎడమ కాలితో నంది ముఖంలో తన్నగా, దానివల్ల నందికి నోటిలో పైన ఉండే పళ్ళు అన్నీ రాలి పడిపోయాయి. ఈ చరిత్ర లోకంలో ప్రసిద్ధి పొందేటట్లుగా హనుమంతుడు విష్ణుభక్తులను తనను విగ్రహరూపంలో ప్రతిష్ఠ చేసేటట్లుగా నియమించాడు.

శివుడు, కాశీ నగరంలో, ఉమాదేవితో "వేదంలో చెప్పిన అర్థాన్ని నీకు చెబుతున్నాను. జానకినాథుడే పరబ్రహ్మం– అని చెప్పబడినదానిని నీకు ఉపదేశిస్తున్నాను" అని అన్నాడు. శంకరాచార్యులు కూడా "వేదంలోని వాస్తవాన్ని తెలుసుకోదలచినవారు శ్రీవిష్ణుపురాణంతో తెలుసుకోండి" అని చెప్పారు. శ్రీవిష్ణుపురాణాల్లో శ్రీపరాశర భగవానుడు "ఏ విధంగా సమస్త దేవతలలో నారాయణుడు తప్ప, పరుడు ఇంకొకడు లేడో, ఆ విధంగానే, సమస్త మంత్రాలలో అష్టాక్షరికి మించిన మంత్రం వేరొకటి లేదు" అని అనుగ్రహించారు. శుకమహర్షి పరీక్షిత్తుతో, సమస్త వేదాలను మాటిమాటికి విచారించి చూడగా, ధ్యానానికి తగిన కారణ వస్తువు నారాయణుడే సుమా! – అని అనుగ్రహించారు. వ్యాసుని సాక్షాత్ శిష్యుడైన బోధాయనుడు తాము

విచారించిన అర్థాన్ని, అంటే, శ్రీమన్నారాయణుడే పరదైవం– అనేది ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం – అనే మూడు వేదాలలో చెప్పబడినది. ఈ విషయం మహోపనిషత్తులో మరింత దృఢంగా చెప్పబడి ఉన్నది" అనే విషయాన్ని తన శిష్యులకు సత్యప్రమాణం చేసి చెప్పాడు.

"వ్యాసుని భుజాలు స్తంభించాయి" అనేదే నిజం అయితే, "విష్ణువు పరుడు" అని చెప్పిన శివుడు, శ్రీపరాశరుడు, శుకుడు బోధాయనుడు, శంకరాచార్యులవారు మొదలైనవారికికూడా వారి భుజాలు, నోరు స్తంభించిపోవద్దా! అందువల్ల, శైవులు అసూయతో వేదవిరుద్ధంగా చెప్పడం నిరసించదగినదే అవుతున్నది.

## 21. కపాల మాల

### పూర్వపక్షమ్

శివుడు బ్రహ్మతలను కపాలమాలికగా ధరించడం వల్ల అతడే పరుడు – అని శైవులు వాదిస్తారు.

### సిద్ధాంతమ్

శివుడు గర్వించి సంచరించడాన్ని సహించలేని బ్రహ్మ "నా తలను తరుగు", అని అనుమతి ఇవ్వగా, తరువాత తన తలను శివుడు గిల్లి వేయగా, చనిపోయి, కోపించడానికి యోగ్యత లేకుండా ఉన్నప్పటికీ, " తండ్రి తలను తరిగాడు" అని నింద మోపి, " కపాలీ త్వం భవిష్యసి" – నీవు కపాలివిగా, కపాలంతో కూడినవాడవుగా – కాగలవు" అని శాపాన్ని ఇచ్చాడు.

బ్రహ్మ కపాలం శివుని చేతికి అంటుకొని, ఊడకుండా ఉండగా, శివుడు కపాలియై, భిక్షను ఎత్తుకుంటూ తిరగడం ఆరంభించాడు. తరువాత, బదరీ నారాయణుడు తన వక్షస్సులోని స్వేదబిందువును ఆ కపాలంలో పడేటట్లు చేయగా, అప్పుడు ఆ కపాలం శివుని చేతి నుండి వీడి కింద పడింది – అనే చరిత్ర పురాణాలలో తెలుపబడింది.

కల్పాంతంలో బ్రహ్మ, రుద్రుడు ఏకకాలంలో విష్ణువులో లయిస్తున్నారు అని వేదం పలుకుతున్నది. శివునిలో బ్రాహ్మణ్యం, అంటే, ఎల్లప్పుడూ శుద్ధుడై ఉండడం అనేది– లేనందు వల్ల, శివునకు అగ్నిలో ఆహుతి చేసినప్పటికీ, వెంటనే " అప ఉపస్పృశ్య" అని చేతితో నీటిని కడిగిపోవడం బ్రాహ్మణులందరికీ విధింపబడిన అనుష్ఠానం కనుక శ్మశానాన్ని రుద్రభూమి అనే పిలుస్తూ ఉండడం వల్ల శవభస్మాన్ని శివుడు ధరిస్తున్నట్టుగా చెప్పబడడం వల్ల శివుడు పరుడు అనే వాదం సరికాదు.

అందువల్ల శివుడు బ్రహ్మ కపాలాన్ని మాలికగా ధరించాడు, కనుక, పరుడు అని శైవులు అనడం అబద్ధమే అవుతుంది.

**"సూర్యస్యైవ తు యో భక్తః సప్తజన్మాంతరం నరః,**
**తస్యైవ తు ప్రసాదేన రుద్రభక్తః ప్రజాయతే,**
**శంకరస్య తు యో భక్తః సప్తజన్మాంతరం నరః,**
**తస్యైవ తు ప్రసాదేన విష్ణు భక్తః ప్రజాయతే"**

(ఏడు జన్మలు సూర్యుని భక్తునిగా ఉండేవాడు, ఆ సూర్యుని అనుగ్రహం వల్ల శివుని భక్తుడు కాగలడు. ఏడు జన్మలు శివుని భక్తునిగా ఉండేవాడు, ఆ శివుని అనుగ్రహం వల్ల విష్ణు భక్తుడు కాగలడు) అని మొదలైన ప్రమాణాలు కూడా శివుని అవరత్వాన్ని విష్ణువు పరత్వాన్ని నిరూపిస్తున్నాయి.

## 22. జ్ఞాన మోక్షాలను గ్రహించడం

### పూర్వపక్షమ్

శివుడు తన భక్తులకు జ్ఞానమోక్షాలను ప్రసాదిస్తాడు కనుక, అతడే పరుడు – అని శైవులు వాదిస్తారు.

### సిద్ధాంతమ్

జ్ఞానం, తపస్సు అనేవి సాత్త్వికి గుణాల కార్యాలు. విష్ణువు సాత్త్విక గుణాన్ని కలిగినవాడు. బ్రహ్మ రాజసగుణాన్ని కలిగినవాడు. శివుడు తామస

గుణాన్ని కలిగినవాడు. శివుడు జ్ఞానాన్ని కలిగినవాడే అయితే, విష్ణు యొక్క మోహినీ వేషాన్ని చూచి భ్రమిస్తాడా? తండ్రి తలను గిల్లి కపాలి అవుతాడా? పాద్మపురాణంలో చెప్పిన విధంగా, కపాలియై భిక్షను ఎత్తుకుంటూ శివుడు తిరిగేటప్పుడు, అతడు దారుకావనంలో ఋషుల పత్నుల ముందు, వారు మోహించేటట్లు తిరిగి, ఆ ఋషుల శాపాన్ని పొందడం అనేది జ్ఞానకార్యం అవుతుందా? మహాభారతంలో చెప్పబడిన అశ్వత్థామ పుట్టిన కథ శివుని జ్ఞానిగా తెలుపుతుందా?

ఘంటాకర్ణుడు అనే అసురుడు శివుని దగ్గర మోక్షాన్ని కోరినా, దానికి తగిన దారి అతని వద్ద లేదని తెలిసి, తరువాత కృష్ణుని ఆశ్రయించి, తాను తన తమ్ముడుకూడా మోక్షాన్ని పొందారు– అని మహాభారతానికి చెందిన హరివంశంలో చెప్పబడింది కదా. (ఇతడు శివుని దగ్గరనుండి వెళ్లి, కుబేరుని దగ్గర తిరునామాలను ఉపదేశించాడు – అని ప్రసిద్ధి) .

అదే హరివంశంలో మార్కండేయునకు "విష్ణువే మోక్షాన్ని ఇవ్వగలిగినవాడు" – అని శివుడు తెలియజేసిన వృత్తాంతం చెప్పబడినందున, వటవృక్షం మూలంలో అగస్త్యుడు, పులస్త్యుడు, దక్షుడు, మార్కండేయుడు అనే వీరికి క్షీరాబ్దినాథుని తాను సేవించే మార్గాన్ని శివుడు ఉపదేశించినందునకదా, రుద్రుడు జ్ఞానప్రధుడు అనబడుతున్నాడు.

**"ఞాల మళందానై ఆழி క్కిడన్దానై ఆలమేల్ వళర్ న్దానై తాన్ వణంగుమ్ ఆఱు"** (నాన్ముగన్ తిరువందాది – 17)

(భూమిని కొలచినవాడు, సముద్రంలో పరుండి ఉండేవాడు, మర్రి చిగురుటాకులో పరుండి ఉండేవాడైన భగవానుని తాను సేవించే రీతిని) అని భక్తిసార మునీంద్రుల తిరువాక్కు. నేను శిరసా నమస్కరించే శ్రీపాద పద్మాలను కలిగినవాడు. అతడు, లోకాలను అన్నిటిని తన పాదాల కింద వశం చేసికొన్నవాడు. పాలసముద్రంలో నిద్రించేవానివలె, లోకరక్షణ కోసం ఉపాయ చింతను చేస్తూ ఉండేవాడు, ఆర్తుల రక్షణాన్ని చేసేవాడు, ప్రళయ

కాలంలో నాతో పాటు, సకల పదార్థాలు నశించిపోయే సమయంలో, వాటిని అన్నిటినీ తన నోటిద్వారా తన లోపలకు గ్రహించి, తన ఉదరంలో పెట్టుకుని రక్షిస్తూ, మర్రి చిగురుటాకులో పరుండి ఉండే అద్భుత శక్తిని కలవాడు– అని కదా, రజోగుణ తమోగుణ కాలుష్యం లేని, సత్వగుణ సంపన్నుడై ఉండే దశలో నలుగురు మునీంద్రులకు శివుడు ఉపదేశించాడు.

మర్రిచెట్టు నీడలో తపస్సు చేసి, అప్పుడే జ్ఞానాన్ని పొందినవాడు, భగవత్సంబంధాన్ని పొందడానికి ముందే, శిష్యపరిగ్రహం చేసేవారివలె, వెంటనే నలుగురకు ఉపదేశించడం శివుడు ఆరంభించడం అనేది, బాలాకి అజాతశత్రువుకు ఉపదేశించడానికి ఆరంభించినట్లుగా ఉన్నది" అని "నెటి వాశల్ తానేయాయ్" అనే ముదల్ తిరువందాది నాలుగవ పాశుర వ్యాఖ్యానంలోని శ్రీసూక్తి.

**"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ శ్రియమిచ్ఛేత్ హుతాశనాత్,**
**ఈశ్వరాత్ జ్ఞానమన్విచ్ఛేత్ మోక్షమిచ్ఛే జ్జనార్ధనాత్"**
**(మత్స్య పురాణం)**

(ఆరోగ్యాన్ని సూర్యుని ఉపాసించి, సంపదను అగ్నిని ఉపాసించి, జ్ఞానాన్ని శివుని ఆశ్రయించి, మోక్షాన్ని విష్ణువును శరణాగతి చేసి పొందాలి) అనే ప్రమాణం కూడా ఇక్కడ స్మరించదగినది.

ఇందువల్ల, శివునకు మోక్షాన్ని ఇచ్చే అధికారం లేదు. నారాయణునకు ఒక్కనికే మోక్షాన్ని ఇచ్చే అధికారం ఉన్నది – అని నిరూపితమైనది. శైవులలో ఒక తెగవారు సైతం అర్ధనారీశ్వరుడు అనే శక్తితో కూడిన చిచ్ఛక్తికి మోక్షప్రదత్వం లేదు – అని చెబుతారు.

# 23. లింగయోని

## పూర్వపక్షం

శివుని లింగాన్ని విష్ణువు యోనియై ధరిస్తున్నాడు కనుక, శివుడే పరుడు – అని శైవులు అంటున్నారు.

## సిద్ధాంతమ్

భృగు మహర్షి శాపం వల్ల, అదే సమయంలో, గౌతముడు ఇచ్చిన శాపం వల్ల శివునకు, ఉమాదేవికి వారి వారి చిహ్నాలు తెగిపడగా, పైకి వ్యక్తమైన శివుని లింగాన్ని తలక్రిందులుగా పార్వతి తన యోనిలో ధరించినట్లు లింగపురాణం చెబుతున్నది యోనిపీఠం స్త్రీచిహ్నం. కదా. కనుక, పురుషోత్తముని గుహ్యం యోనిపీఠం అనేది సర్వథా. అబద్ధం.

మహర్షి ఇచ్చిన శాపంచేత శివునకు, ఉమాదేవికి వారి లింగాలు తెగిపోగా, లింగాలు లేనివారై అరణ్యంలో వారు సంచరిస్తూ ఉన్నప్పుడు, శివుడు విష్ణువును ఉద్దేశించి వేయి సంపెంగ పూలతో అర్చించగా, అందులో ఒకటి తక్కువ అయినది. అపుడు శివుడు తన నాసికను కోసి, అర్పించాడు అప్పుడు ప్రీతిని పొందిన విష్ణువు ఇద్దరికీ లింగాలు మళ్ళీ కలిగేటట్లుగా, పరస్పరం సంగమించి సంతోషాన్ని పొందేటట్లుగా అనుగ్రహించిన కథ రుద్రగీత, అగస్త్య సంహిత అనే గ్రంథాలలో ఉన్నది.

ఇందువల్ల విష్ణువు యోనిపీఠమై, శివుని లింగాన్ని ధరించి ఉన్నట్లుగా చెప్పిన మాట సర్వథా అసత్యం. శివునకు చేతులు ఉండగా, కాళ్ళు ఉండగా, కళ్ళు ఉండగా, శరీరం ఉండగా, వాటిని చూసి కోరకుండా, మునివరుల శాపంచేత తెగిపడిన ఉపస్థను ఆరాధిస్తూ ఉండడం అనేది మాధవుని నోటికి వచ్చినట్లుగా దూషిస్తూ పలికినందు వల్ల ఏర్పడిన దుష్కర్మ ఫలితమే కదా.

# 24. శంకర నారాయణుడు

## పూర్వపక్షమ్

శివుడు, తన శరీరంలోని సగభాగాన్ని నారాయణునకు ఇచ్చి శంకర నారాయణుడై అవతరించాడు ఆ రూపంలో శివునికి ప్రాధాన్యం ఉన్నందున, విష్ణువునకు ప్రాధాన్యం లేనందున శివుడే పరుడు అని శైవులు వాదిస్తున్నారు.

## సిద్ధాంతమ్

అర్ధనారీశ్వరుడు అని చెప్పబడే శివుడు తన సగం శరీరాన్ని పార్వతికి ఇచ్చి, తరువాత, శంకర నారాయణ అవతారంలో ఇంకొక సగాన్ని నారాయణునితో కలసినందున శివుడు మన్మథునివలె అశరీరి అయ్యాడు కాబోలు!

ఒక విష్ణుభక్తుడు పడమటి దిక్కులో ఉండే శ్రీరంగానికి యాత్రగా రావాలని బయలుదేరి, దారి తప్పి మార్గాయాసంతో అలసటను పొంది, మూర్ఛను పొందాడు. తరువాత కొంతసేపటికి తేరుకొని సమీపంలో ఒక ఆలయాన్ని చూచాడు. అక్కడ వంటను చేసుకొని, తన తిరువారాధన మూర్తికి ఆరగింపు చేసి, తరువాత తాను కూడా భుజించవచ్చుననే అభిప్రాయంతో ఆ ఆలయం సమీపానికి వెళ్ళాడు. కానీ, అది శివుని ఆలయం – అని తెలుసుకుని, అక్కడనుండి నిరాశగా వెనుకకు తిరిగాడు.

(పురుషసూక్తంలో శ్రీమన్నారాయణుడు సమస్త ఆత్మలలోను అంతర్యామిగా వేంచేసి ఉన్నాడు – అని చెప్పబడిన రీతిని, అథర్వశిరస్సులో శ్రీమన్నారాయణుడు నాలో అంతర్యామిగా ఉన్నాడు, అందువల్లనే లోకాధిపతియై ఉన్నాను– అని శివుడు చెప్పిన రీతిని, వేరొక శ్రుతివాక్యంలో బ్రహ్మరుద్రులు విష్ణువునకు కరచరణాది అవయవాలవంటివారు – అనే రీతిని భారతం కర్ణపర్వంలోనూ, పాద్మోత్తరంలోను విష్ణువు శివునకు అంతర్యామి అని చెప్పబడిన రీతిని ఇక్కడ స్మరించాలి)

ఆ ఆలయంలో ఉండే శివునకు అంతర్యామిగా ఉన్న సర్వేశ్వరుడు, తన భక్తుడు ఆకలితో ఆ విధంగా వెనకకు తిరిగి పోవడాన్ని చూసి, అతనిపై జాలిని పొందినవవాడై, ఒక శ్రీవైష్ణవుని రూపాన్ని ధరించి, ఆ భాగవతుని దగ్గరకు వచ్చి, " మీరు ఎందుకు ఆకలితో వెళ్ళిపోతున్నారు?" అని అడిగాడు. అప్పుడు ఆ శ్రీవైష్ణవుడు "నేను వంటను చేసుకోవడానికి తగిన చోటు ఎక్కడ కనబడలేదు" అని అన్నాడు. " అయితే మీరు ఇంతకుముందు దాటి వచ్చిన ఆలయంలో మీరు వంటను చేసుకోవచ్చు కదా!" అని శ్రీవైష్ణవుని రూపంలో ఉండే భగవానుడు అనగా, " అది శివాలయం కదా" అని ఆ వైష్ణవుడు అన్నాడు. " కాదు, అది విష్ణువు కోవెల సుమా!" అని భగవానుడు అనగా అయితే సరే వస్తున్నాను అని ఆలయంలో ప్రవేశించి చూడగా, శివునకు అంతర్యామిగా ఉండే నారాయణుడు చతుర్భుజుడై, శంఖ చక్ర కిరీట మకర కుండల లక్ష్మీచిహ్నాలతో దర్శనాన్ని అనుగ్రహించాడు. ఆ శ్రీవైష్ణవుడు అక్కడ వంటను చేసుకుని, తన ఆరాధనామూర్తికి నివేదన చేసి, తాను కూడా భుజించి, తిరిగి వెళ్ళాడు– అనే ఈ కథను ఆధారంగా చేసుకుని, శివునకు ఇటువంటి మాహాత్మ్యం కల్పించారో! ఏమో!

**"ఏఱాళు మిఱైయోనుమ్"** (తిరువాయ్ మొ**ழி** 4–8–1) అనే పాశురానికి ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో ఉండే ప్రమాణవచనం–

**"తపసా తోషిత స్తేన విష్ణునా ప్రభవిష్ణునా,**
**స్వపార్శ్వే దక్షిణే శంభోః నివాసః పరికల్పితః"**

(పరమశివుడు తపస్సు చేసినందువల్ల మనసులో ఆనందించిన శ్రీమహావిష్ణువు తన తిరుమేని కుడివైపులో అతనికి చోటును కల్పించి అనుగ్రహించాడు)

**"పశ్యైకాదశ మే రుద్రాన్ దక్షిణం పార్శ్వ మాశ్రితాన్"**

(నా కుడిభాగంలో ఆశ్రయించి ఉన్న పదకొండుమంది రుద్రులను చూడు) అని మోక్షధర్మవచనాన్ని అనుసరించి, తామసదైవం అయిన రుద్రునకు కూడా తన తిరుమేనిలో కుడివైపున చోటును ఇచ్చి, ఆదరించినవాడు, భగవానుడు.

**"పిఱై తంగు శడైయానై వలత్తే వైత్తు,**

**పిరమనై తన్నుందిలే తోఱ్ఱువిత్తు"**

**(పెరియ తిరుమొழி–3–4–8)**

(చంద్రుని తన జటలలో ధరించిన శివుని తన తిరుమేనిలో కుడివైపున ధరించి, బ్రహ్మను తన నాభీకమలంలో జనింపజేసి) అనే విధంగా,

**"ఏఱునై ప్పూవనై ప్పూ మకళ్ తన్నై వేఱిన్ఱి వెణ్ తొழ த్తన్నుళ్ వైత్తు"**

(తిరువాయ్ మొழி– 2–2 –3)

అని చెప్పిన విధంగా, లక్ష్మీదేవికి చోటును ఇచ్చినట్లే ప్రళయం మొదలైన ఆపత్కాలలో బ్రహ్మాదులకు కూడా తన తిరుమేనిలో చోటును ఇస్తాడు. ఇది మహాగుణం అయినందువల్ల దివ్యసూరులు ఎల్లప్పుడూ దీనిని కీర్తిస్తూ పలుకుతారు.

**"స దేవ సౌమ్య! ఇదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్"**

(సృష్టికి ముందు ఇది అంతా సత్ గానే ఉన్నది. ఒకటిగానే, రెండవది లేనిదిగానే ఉన్నది) అని సద్విద్యలో సత్ అనే పదంతో చెప్పబడినవాడు నారాయణుడే– అనే విషయాన్ని మహోపనిషత్తు,

**"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మ నేశానః"**

(సృష్టికి ముందు నారాయణుడు ఒక్కడే ఉన్నాడు, బ్రహ్మ లేడు, శివుడు కూడా లేడు– అని ఘోషించింది.

సుబాలోపనిషత్తుకూడా

**"దివ్యో దేవ ఏకో నారాయణః"**

(సృష్టికి ముందు నారాయణుడు ఒక్కడే ఉన్నాడు) అని చెప్పింది.

**"నారాయణః పరం బ్రహ్మ తత్వం నారాయణః పరః, నారాయణ పరో జ్యోతి రాత్మా నారాయణః పరః, యచ్చ కించిత్ జగత్ సర్వం దృశ్యతే శ్రూయతే ఽ పి వా, అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" (తైత్తిరీయోపనిషత్)**

(పరబ్రహ్మం నారాయణుడే ఉన్నతమైన, సత్యమైన వస్తువు నారాయణుడే. ఉన్నతమైన ఆత్మకూడా నారాయణుడే. ఈ లోకంలో చూడబడేవి, వినబడేవి అయిన అన్ని వస్తువులలోనూ లోపల, బయట కూడా ప్రవేశించి పూర్తిగా వ్యాపించి ఉండేవాడు నారాయణుడే) అని చెప్పినట్లుగా, శివుని గూర్చి పరబ్రహ్మం అని కానీ, పరతత్వం అని కానీ, పరమాత్మ అని కానీ, వేదం ఎక్కడా చెప్పనే లేదు.

"నారాయణాత్ బ్రహ్మ జాయతే, నారాయణాత్ రుద్రో జాయతే, నారాయణాత్ ఇంద్రో జాయతే" (నారాయణునినుండి బ్రహ్మ పుడుతున్నాడు, నారాయణునినుండి శివుడు పుడుతున్నాడు, నారాయణునినుండి ఇంద్రుడు పుడుతున్నాడు) అని నారాయణోపపనిషత్తు ఘోషించింది.

"అథ పున రేవ నారాయణః సో ఽ న్యం కామం మనసా ధ్యాయీత, తస్య లలాటాత్ త్ర్యక్షః శూలపాణిః పురుషో ఽ జాయత"

(మళ్లీ నారాయణుడు మనసులో సంకల్పించాడు. ఆ సంకల్పం వల్ల, అతని లలాటం నుండి మూడు కన్నులు కలిగినవాడు శూలాన్ని చేతిలో ధరించినవాడు అయిన ఒక పురుషుడు పుట్టాడు) అని మహోపనిషత్తు కూడా చెప్పింది.

ఈ విధంగా, కల్పాంతరాలలో నేరుగా నారాయణునినుండి శివుని ఉత్పత్తి చెప్పబడింది. అయితే, నారాయణుని ఉత్పత్తిని చెప్పే వాక్యం ఒక్కటి కూడా వేదంలో చెప్పబడలేదు.

**"సృష్టి స్థిత్యంత కరణీం బ్రహ్మ విష్ణు శివాత్మికామ్,**
**స సంజ్ఞాం యాతి భగవాన్ ఏక ఏవ జనార్దనః"**

(జనార్ధనుడు అయిన భగవానుడు ఒక్కడే సృష్టి, స్థితి, సంహారం అనే మూడిటినీ చేసే బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే మూడు పేర్లను (ఆ పేర్లను కలిగిన రూపాలను) పొందుతున్నాడు) అని విష్ణుపురాణంలోనూ,

**"రక్షార్థం సర్వభూతానాం విష్ణుత్వ ముపజగ్మివాన్"**

(అన్ని జీవరాసులను రక్షించడం కోసం విష్ణువై ఉండే స్వభావాన్ని పొందాడు) అని శ్రీరామాయణంలోనూ చెప్పబడింది.

బ్రహ్మకూడా

**"యస్య ప్రసాదా దహమచ్యుతస్య భూతప్రజాసృష్టికరేంద్రకారీ,**
**క్రోధాచ్చ రుద్రః"**

(తాను ప్రజాసృష్టిని చేయడం విష్ణుయొక్క ప్రసాదం వల్ల, విష్ణుయొక్క క్రోధాంశవల్ల రుద్రుడు సంహరిస్తున్నాడు) అని చెప్పడం ప్రసిద్ధం కదా. సృష్టించేటప్పుడు, బ్రహ్మకు తన తలను సృష్టించుకోగలిగిన శక్తి లేదు. సంహారకృత్యాన్ని చేసే రుద్రునకు తన చేతిలో అంటుకున్న కపాలాన్ని సంహరించగలిగిన శక్తి లేదు. స్వరక్షణలో అశక్తులై ఉండేవారు పరరక్షకులు ఏ విధంగా అవుతారు? మునిగిపోయేవాడొకడు వేరొక మునిగిపోయేవానిని పైకి లేవదీయగలడా?

మధుకైటభుల చేతిలో వేదాలను కోల్పోయిన బ్రహ్మ, ఆ మధుసూదనునే వేదాలను మళ్లీ తిరిగి సంపాదించి ఇవ్వమని కోరాడు. ఆ మధుసూదనుడే సంపాదించి ఇచ్చాడు. భస్మాసురునకు వరాన్ని ఇచ్చిన

శివుడు, తనను అతడు తరిమినప్పుడు, ఆ శివుని విష్ణువే కాపాడాడు. " బాణాసురుడుని రక్షిస్తాను" అని చెప్పి, అతని వేయి బాహువులను శ్రీకృష్ణుడు ఖండించడాన్ని చూచి,

**"కృష్ణ! కృష్ణ! మహాబాహో! జ్ఞానే త్వాం పురుషోత్తమమ్,**
**పరేశం పరమాత్మాన మనాదినిధనం పరమ్"**

(శ్రీవిష్ణుపురాణమ్)

(దీర్ఘమైన చేతులను కలిగిన కృష్ణా! నీవు పురుషోత్తముడవని నేను తెలుసుకున్నాను. పరమేశ్వరుడవై, పరమాత్మవై, ఆది, అంతాలను లేనివాడవై, అందరిని సంహరించేవాడవై ఉండేవాడవు నీవేనని తెలుసుకున్నాను)

అని స్తోత్రం చేసి, " నీవు ఇతని చంపితే, నా పాదాలలో ఇక పడేవారు ఉండబోరు" అని తన దంతాలను చూపించి, ప్రార్థించగా, ఉషాదేవి తండ్రి లేనిది కాకుండా ఉండాలని, "ఆశ్రయనీయులు కానివారిని ఆశ్రయించి వచ్చాడ వీడు, అంతే," అని తలచి, అతని దశను అనుసంధించి తలను ఖండించకుండా, దేవతాంతర భజనను చేసినందుకు తగిన ఫలంగా అతని బాహువులను మాత్రం ఖండించి వేశాడు, సర్వేశ్వరుని నమస్కరించడం అనేది **"నిత్యాంజలి పుటా హృష్టాః"** శ్వేత ద్వీపవాసులు ఎల్లప్పుడూ శ్రీమన్నారాయణుని నమస్కరిస్తూ ఉండేవారై, "నమః, నమః", అనే పదాన్ని అనుసంధిస్తూ ఉంటారు) అన్నట్లు స్వరూప ప్రయుక్తం. భగవంతుని కాకుండా ఉండే అన్యులను నమస్కరించడం " సేవా శ్వవృత్తిః" అని చెప్పినట్లు నీచమైన వృత్తియే కాగలదు.

రుద్రుడు విష్ణువు నుఎదిరించి, ఎదురు బాణాలను సంధించి ప్రయోగించి, ఆ పురుషోత్తముని హూంకారంతో మూర్ఛపోవడాన్ని,

**"అధికం మేనిరే విష్ణుం దేవా స్సర్షిగణా స్తథా"**

(ఋషులతో కూడిన దేవతలు విష్ణువును సర్వాధికునిగా నిశ్చయించుకున్నారు) అనే విషయాన్ని కూడా శ్రీరామాయణం వివరంగా పలికింది.

**"రుద్రం సమాశ్రితా దేవా రుద్రో బ్రహ్మాణ మాశ్రితః,**
**బ్రహ్మా మమాశ్రితో రాజన్! నాహం కంచిదుపాశ్రితః"**

(బ్రహ్మాదులు తమ తమ దుఃఖాలు పోవడం కోసం తనను అశ్రయించినట్లుగా, తాను ఇంకొకరిని ఎవరిని ఆశ్రయించనివాడై ఉండే అద్వితీయ పరదేవత) అనే విషయాన్ని విష్ణుధర్మం పలికింది.

**"భగవానితి శబ్దోఽ యం తథా పురుష ఇత్యపి,**
**నిరుపాధీ చ వర్తేతే వాసుదేవే సనాతనే"**

(భగవానుడు అనే శబ్దం, పురుషుడు అనే శబ్దం కూడా సహజంగానే సనాతనుడైన వాసుదేవునిలో ప్రకాశిస్తున్నాయి)
అని వరాహ పురాణంలోను,

**య ఏవ వాసుదేవో ఽ యం పురుషః ప్రోచ్యతే బుధైః,**
**ప్రకృతిస్పర్శరాహిత్యాత్ స్వాతంత్ర్యాత్ వైభవాదపి,**
**స యేవ వాసుదేవోయం సాక్షాత్ పురుష ఉచ్యతే,**
**స్త్రీప్రాయ మితరత్ సర్వం జగత్బ్రహ్మా పురస్సరమ్"**

(ఎవడు, వాసుదేవుడు అని అనబడుతున్నాడో, అతడే పురుషుడు అని జ్ఞానుల చేత చెప్పబడుతున్నాడు. ప్రకృతి స్పర్శను లేకుండా ఉండేవాడై ఉన్నందువల్ల, స్వతంత్రుడై ఉన్నందువల్ల, గొప్పతనాన్ని కలిగినవాడై ఉన్నందువల్ల, ఆ వాసుదేవుడే సాక్షాత్తు పురుషుడుగా చెప్పబడుతున్నాడు. బ్రహ్మతో పాటుగా ఉండే ఈ జీవులు అందరూ కూడా, స్త్రీసమానులే) అని నరసింహపురాణంలోకూడా చెప్పబడింది.

ఆత్మ స్వరూపానికి స్త్రీత్వాన్ని చెప్పడానికి మూలం ఏమి? అంటే, ఆత్మస్వరూపం సర్వథా పరతంత్రం అయినందువల్ల, అనన్యర్హాం అయినందువల్ల, అనన్య రక్షకమైనందువల్ల, అనన్య భోగ్యమై ఉన్నందువల్ల, స్త్రీత్వసాధారణ్యాం అత్మకు ఉన్నది పురుషోత్తమత్వానుసంధానంలో స్వస్వరూపానికి త్రిత్వానుసంధానం అవర్జనీయం.

**"విష్ణుభక్తివిహీనో యః సర్వశాస్త్రార్థవేద్యపి,**
**బ్రాహ్మణ్యం తస్య న భవే త్తస్యోత్పత్తిః నిరూప్యతామ్"**

(పాద్మ పురాణమ్)

(సకల శాస్త్రధాలను తెలిసినవాడైనా ఎవడు ఉష్ణ భక్తిని లేనివాడు అతనికి బ్రాహ్మణులు అతని ఉత్పత్తిని గూర్చి విచారించవలసి ఉన్నది)

**"యః పుత్రః పితరం ద్వేష్టి తం విద్యాదన్యరేతసమ్,**
**యస్తు నారాయణం ద్వేష్టి తం విద్యాదంత్యరేతసమ్"**

(తండ్రిని ద్వేషించే పుత్రుని వేరొకని రేతస్సువల్ల జన్మించినవాడని తెలియాలి. నారాయణుని ద్వేషించేవానిని చండాలునకు జన్మించినవానినిగా తెలియాలి)

**"విష్ణురాత్మా భగవతః శివస్య"**

(శివునకు ఆత్మ విష్ణువు. ) అని మహాభారతం పలికింది. అత్రి, భృగువు, కాశ్యపుడు, దక్షుడు, వశిష్ఠుడు, నారదుడు, వాల్మీకి, పరాశరుడు, వ్యాసుడు, శుకుడు, శౌనకుడు మొదలైన మహర్షులు నారాయణుడే సర్వస్మాత్పరునిగా నిశ్చయించి పలికారు.

ఈ విధంగా ఉండే అరుదైన గొప్ప అర్థవిశేషాలను అన్నిటిని చోళప్రభువు సభలో శ్రీకూరేశులు ఉపన్యసించి, శైవుల దూషణాలను ఖండించగా, శైవవిద్వాంసులు వాటికి బదులు చెప్పడానికి శక్తిని లేనివారై, నోరు మూసుకున్నారు. "నీవు ఈ పత్రాన్ని పాడుకాకుండా

రక్షించగలిగితేగదా, నీవు అనుకున్నది సాధించినవాడవు అవుతావు. నీవు అనుకున్న, సర్వస్మాత్ పరునిగా భావించే దేవతకు ఉండే గొప్పతనాలు అన్నీ సర్వేశ్వరుని వల్లనే కలిగినవి– అని ప్రమాణాలు చెబుతూ ఉండగా, ఈనాడు నీవు నిర్బంధిస్తే, నేను ఈ పత్రం పైన సంతకం చేసి, వెళ్ళానే అనుకో! రేపు, జ్ఞాని అయినవాడు ఒకడు వచ్చి, వేదాలు అన్నీ నారాయణుని పరదైవం అని చెబుతూ ఉండగా, అజ్ఞాని అయినవాడు ఒకడు ఈ విధంగా వ్రాసి వెళ్ళాడే!– అని కదా భావిస్తాడు. ఆ విధంగా అతడు భావించడం కంటే, ఈనాడు నీవు నన్ను ఏమి చేయాలని భావిస్తున్నావో, ఆ విధంగా చేసుకో" అని అన్నారు. ఈ మాటతో చోళప్రభువు కోపానికి వశుడు అయ్యాడు.

శ్రీకూరేశ విజయ వివరణం సంపూర్ణమ్

★★★★★

**శ్రీ కూరేశుల శ్రీ చరణాలే శరణమ్**

**"అర్వాంచో యత్ పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే**
**మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశికా ముక్తి సష్క్ మాపుః,**
**సోఽ యం రామానుజ మునిరపి స్వీయముక్తిం కరస్థాం**
**యత్సంబంధా దమనుత, కథం వర్ణ్యతే కూరనాథః?"**

(తమకు తరువాత అవతరించిన ఆచార్యులు ఎవరి శ్రీచరణాలతో సంబంధాన్ని పొంది, ముందు అవతరించిన ఆచార్యులు ఎవరి శిరస్సుతో సంబంధాన్ని పొంది, ముక్తిని పొందారో, ఆ భగవద్రామానుజులు కూడా ఎవరి సంబంధం వల్ల తమకు మోక్షం చేజిక్కింది అని భావించారో, అటువంటి గొప్పతనాన్ని కలిగిన కూరేశులను ఏ విధంగా వర్ణించడం సాధ్యం అవుతుంది?) .

★★★★★

# వ్యాఖ్యానసహిత కూరేశవిజయ మూలం

★★★★★





శ్రీమతే రామానుజాయనమః.



## వ్యాఖ్యానసహిత

## కూరేశవిజయః



పరోపన్యస్తపూర్వపక్షశ్లోకాః.

శ్లో ॥ గాయత్రీబోధితత్వా ద్దశరథతనయస్థాపితా
రాధితత్వాచ్ఛౌరేః కైలాసయాత్రావ్రతముదితతయాభీ
ష్టసంతానదానాత్ । నేత్రేణస్వేనసాకం దశశతకమ
లైర్విష్ణునాపూజితత్వా త్తస్మైచక్రప్రదానాదపిచ పశుప
తిస్సర్వదేవప్రకృష్టః ॥ ౧ ॥ కందర్పధ్వంసకత్వాద్గర
ళకబళనాత్కాలగర్వాపహత్వా ద్దైతేయావాసభూమి
త్రిపురవిదళనా ద్దక్షయాగేజయిత్వాత్। పార్థస్యాస్త్వ
స్త్రప్రదానాన్నరహరి విజయాన్మాధవే స్త్రీశరీరేశా స్త్ర
స్సంపాదకత్వాదపిచ పశుపతిస్సర్వదేవప్రకృష్టః॥ ౨ ॥
భూమౌలోకైరనేకైస్సతత విరచితారాధనత్వా దమీ
షామప్యైశ్వర్యప్రదత్వా ద్దశవిధవపుషా కేశవేనార్చి

తత్వాత్। హంసక్రోడాంగధారిద్రుహిణమురహరాదృష్టశీర్షాంఘ్రికత్వాజ్జన్మధ్వంసాద్యభావాదపిచ పశుపతిస్సర్వదేవప్రకృష్టః ॥ ౩ ॥ వారాణస్యాంచ పారాశరి నియమభుజ స్తంభనాత్త్రిపురాణాం విధ్వంసే కేశవేనాశ్రితవృషవపుషా ధారితక్ష్మాతలత్వాత్। అస్తోకబ్రహ్మశీర్షాస్థ్యనిశకృతగళాలంక్రియాభూషితత్వాద్దానాచ్చజ్ఞానముక్త్యోరపిచ పశుపతిస్సర్వదేవప్రకృష్టః॥ ౪॥ వైశిష్ట్యేయోనిపీఠాయితనరకరిపుశ్లిష్టభావేనశంభోస్స్వస్యైకార్ధప్రతీకాయిత హరవపుషా లింగితత్వేనయద్వా। అప్రాధాన్యాద్విశిష్టాద్వయసమధిగమే దానవానామరాతేశ్శంభోః ప్రాధాన్యయోగాదపిచ పశుపతిస్సర్వదేవప్రకృష్టః॥ ... ... ... ... ... ... *

---

అవతారికా.— శ్రీయఃపతిత్వాదపిభూపతిత్వం ప్రఖ్యాపయిత్వా పరమంమురారేః। భూమిస్తవేభూపతినామనిష్ఠాం వంశప్రతిష్ఠాం మహతీమవాప ॥ ౧ ॥ ధర్మాచార్యస్సుధీస్సోయంనిర్మాతివిదుషాంముదే। విష్ణుపారమ్యపద్యానాం ప్రమాణమణిసంపుటం॥ ౨॥ పత్యుః పశూనాంపరతాంపదైర్యైఃపంచభిరావృతాం। నిరాకరోతికూరేశో బుధసంఖ్యాగతైస్తుతైః ॥ ౩ ॥ పంచవింశతి కక్ష్యాభిరుపన్యస్తైమతేపరైః। సార్ధయా శతదూషణ్యాసిద్ధాంతంవక్తికూరరాట్ ॥ ౪ ॥ సిద్ధాంతంవక్తు

మారేభేస ప్రమాణంహి కూరరాట్ । తత్ర భూపసభా మధ్యే విదుషాం మోహమావహాత్ ॥ ౫ ॥ శ్రీకూరాధిప వాక్యానాం వ్యాఖ్యానే భువి కః ప్రభుః । తత్ప్రసాదస్తు లేఖిన్యా మయాలిఖితి తత్స్వయం ॥ ౬ ॥ ... ... *

అథ భగవద్రామానుజాచార్య శిష్యావతంసాః శ్రీమన్మహాభట్టారకపదప్రశంసాః శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయవేదాంతనిస్తారకరిష్ఠాః, అనంతకల్యాణగుణగణపరిపూర్ణాః శ్రీవత్సాంకమిశ్రాః చోళభూపాలసభాయాం సప్తరాత్రమతిమాత్రం పరతత్త్వవాదేప్రవృత్తే కైశ్చిన్మోహాశాస్త్రశంకా కళంకితహృదయైః కుదృష్టిభిః ఉపన్యస్తాన్ హేత్వాభాసాన్ ప్రత్యాదిశంతో మహాపూర్ణోద్యజ్జయఘోషాః తత్రాద్యంగాయత్రీబోధితత్వాదితి ప్రథమతః పరమతోపాత్తం దూషణం గాయత్రీతి, ప్రఖ్యాతేతి, శ్లోకద్వయేన దశదూషణైర్నిరాచక్షతే॥

శ్లో॥ గాయత్రీపూర్వ కృత్యాచమన విధిపురస్కార
సంకల్పకార్యే గోవిందాఖ్యా ప్రయోగాద్ధరిరితి కథనాచ్ఛ్రుత్యధీత్యాదికాలే। భర్గశ్శబ్దస్యసూర్యాత్మక
హరిమహసో వాచకత్వాత్పరస్తాదోంకారాఖ్యే య
భావాదవననిజగుణాచ్ఛుద్ధసత్వాశ్రయత్వాత్॥ ౧ ॥

వ్యా॥ గాయత్రీతి । గాయంతం త్రాయతే యస్మాద్గాయత్రీ తేన కథ్యతే, న గాయత్ర్యాః పరోమంత్రః న మాతుః పరదేవతా, బ్రహ్మాశ్చ సకామస్తుగాయత్రీం

వేదమాతరం, ఇత్యాదిప్రమాణ ప్రసిద్ధిమత్త్యాం గాయ
త్ర్యాం తత్పూర్వాయాః కృత్యా క్రియాసంధ్యారూపా
తస్యాంచ, కృత్యా క్రియాదేవతయోరితి నానార్థః॥
తత్పూర్వాచమనేచ విధిపురస్కారేషు స్నానప్రాయశ్చి
త్తప్రాణాయామాదిషు తత్పురస్కృత సంకల్పకార్యే
చ ఏతాదృశేషు వైదికకార్యేష్విత్యర్థః. గోవిందవిష్ణ్వా
ఖ్యానాంనామ్నాం తస్యసర్వాత్మకత్వేనసర్వశబ్దవాచ్య
త్వేనచ పర్యవసానవృత్త్యావా తాదృశవిలంబా సహ
మానయా లోకవృత్త్యావా ప్రవృత్తానాం దేవసవితృ
ప్రణవ బ్రహ్మ సత్య కేశవ నారాయణ గోవిందహర్యాదీ
నాం ప్రయోగాత్. గంగాగీతాచగాయత్రీ తులసీగోపి
చందనం । ఏకాదశీహరేర్నామ సాలగ్రామశిలార్చనం॥
వైదికాష్టకమేతాని నియమేనదినేదినే । యేభజంతికలౌ
నిత్యం తేషామపి నమోనమః ॥ ఇత్తుక్యరీత్యాసదాచార
వద్భిరారాధ్యదేవతా త్వేనప్రసిద్ధేః విష్ణురేవసర్వదేవ
తాభ్యః ప్రకృష్టః. ఏవంసర్వత్రాన్వయః. తత్రాదౌశ్రీ
గోవిందగోవింద శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమాన
స్యేతి అథశ్రీమద్భగవతోమహాపురుషస్యాది నారాయణ
స్యేతి సంకల్పః. గోవిందనామనిర్వచనభేదస్తు - గౌరే
షాహితథావాణీ తాంచ విందయతేయతః । గోవింద
స్తుతతో దేవమునిభిః కథ్యతేభవాన్॥ త్వద్విస్తరాయథా
దేవా అహంభూతపతిస్తథా । నతదస్తివినాదేవయత్తే

విరహితం క్వచిత్ ఇతి హరివంశాదౌ రుద్రవాక్యాత్ దేవా
వగంతవ్యః. మా ఋచో మా యజుస్సామ మాత్రాతపత్
కించన । గోవిందేతి హరేర్నామ గేయం గాయస్వ నిత్య
శః ॥ సకృత్స్మృతోపి గోవింద ఇత్యాదితత్రైప్ర - హ
రణాత్ప్రాణినో దేవ తతో హరిరితి స్మృతః। బృహత్వా
ద్బృంహణత్వాచ్చ తస్మాద్బ్రహ్మేతి విశ్రుతః ॥ వస
నాద్దేవనాచ్చైవ వాసుదేవేతి శబ్దితః । తతస్త్వం విష్ణు
నామాసి యతో వ్యాప్తిః ప్రదర్శితా ॥ యతస్తు భూతభ
వ్యేశస్త్వం నారాయణశబ్దితః ఇతి చోక్తం. స్నానకర్మ
ణి - గోవిందేతి సదా స్నానం గోవిందేతి సదా జపః ।
గోవిందేతి సదా ధ్యానం సదా గోవిందకీర్తనం ॥ మృజ్జ
లాభ్యాం బహిస్స్నానమాంతరం విష్ణుచింతనం । ధ్యా
యేన్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు ॥ వర్ణా
శ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్ । విష్ణురారా
ధ్యతే పంథా నాన్యస్తత్తోషకారకః । సకృన్నారాయణే
త్యుక్త్వా పుమాన్ కల్పశతత్రయం । గంగాదిసర్వతీర్థే
షు స్నాతో భవతి పుత్రక ॥ ప్రాయశ్చిత్తాన్యశేషాణి త
పః కర్మాత్మకాని వై । యాని తేషామశేషాణాం కృష్ణా
నుస్మరణం పరం ॥ ప్రాయశ్చిత్తాని చీర్ణాని నారాయణ
పరాఙ్ముఖం । న నిష్పునంతి రాజేంద్ర సురాభాండమివా
పగాః ॥ యస్య స్మృత్యా చ నామోక్త్యా తపోయజ్ఞక్రియా
దిషు । న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమ

చ్యుతం॥ ఇతి నిరుక్త్యర్థంసఏవోచ్యతే. ప్రాణాయా
మపరితానా మోమాదీనాం తద్వాచకత్వంతు - గిరా
మస్మ్యేకమక్షరం - ప్రణవస్సర్వవేదేషు - ఓమిత్యేకాక్ష
రం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ - ఇత్యాదితద్వాక్యా
దేవస్ఫుటమ్. తదర్థంతు అత్రైవోత్తర త్రవక్ష్యామః.
భవతీతి భూరితితన్నామ - సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్ ఇ
తిశ్రుతేః. భువనేషువసతీతి భువనాన్యస్మిన్ వసంతీతివా
భువః వాసుదేవః. సూః ప్రసూతిస్తామిచ్ఛతీతిసువః. షూ
ఙ్ ప్రాణిప్రసవే - తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్ ఇ
త్యుపనిషదుపదేశః.ఆచమనే- కేశవాద్యైస్త్రిభిః పీత్వే
తిపౌరాణికాః. సంధ్యాయాంమంత్రాచమనే - నారా
యణపరోజ్యోతిః సత్యంజ్ఞానమితిశ్రుతిదర్శనాత్. సత్య
జ్యోతిరాదిభిస్సఏవాభిధీయ్యతే. సుష్ఠుప్రాణినః కర్మస్వీ
రయతీతివ్యుత్పత్త్యా సూర్యశబ్దో విష్ణుపర్యాయః. వైది
కంశబ్దరూపం. ఏషహ్యేవ సాధుకర్మ కారయతి తంయ
మేభ్యోలోకేభ్యః ఉన్నినీషతీతిశ్రూయతే. ఉపస్థానమం
త్రేచవరుణశబ్దస్య తదంతర్యామి పర్యాయాత్ తద్దృ
ష్ట్యావరణీయత్వాదినావాతన్నామతా. మిత్రస్యేత్య
త్రమిత్రశబ్దః పాదత్రయేణ త్రైలోక్యంమిమాత ఇతి
త్రివిక్రమమాహ. డుమిఞ్ ప్రక్షేపణ ఇతి ధాతుః. అథ
వామీహింసాయామితిధాతుః. హింసారూపాత్సంసా
రాత్త్రాయత ఇతిమిత్రః. త్రైఙ్ పాలనఇతి. సంధ్యా

నిగమనేషు స్తుత్వా దేవం జనార్దనం - సర్వదేవ నమ
స్కారః కేశవం ప్రతిగచ్ఛతీతి తదభిధానం ప్రమాణయ
తతత్పరత్వం. క ఇతి బ్రహ్మణో నామ ఈశోహం సర్వదే
హినాం। ఆవాంతవాంగే సంభూతౌ తస్మాత్కేశవనా
మవాన్ ఇత్యాదికమిహానుసంధేయమ్. అగ్నిమండలమ
ధ్యస్థం ధ్యాయేద్యజ్ఞపతిం హరిమ్। యజ్ఞకృద్యజ్ఞభృద్యజ్ఞీ ఇ
త్యాదివచనాదౌపాసనాద్యశ్వమేధపర్యంతం హవ్యార్ధ్య
తృశ్చ. విష్ణోర్ని వేదితాన్నేన యష్టవ్యం దేవతాంతరమ్। పి
తృభ్యశ్చాపి తద్దేయం తదానంత్యాయ కల్పతే. పితృరూపీ
జనార్దనః ప్రియతాం ఇత్యాదిభిరభివ్యక్తత్వస్స ఏవ కవ్యేష్వ
పి. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్.
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ఇతి గీతా
చార్యాస్స్వయమూచుః. అథ గాయత్రీహృదయే యాజ్ఞవ
ల్క్యేన పృష్టశ్చతుర్ముఖస్సర్వకారణం విష్ణురేవేత్యుక్తవాన్।
బ్రహ్మాండే. ఆదిత్యదేవతాయాశ్చ ప్రేరకం పరమాద్భుతం
భర్గస్సం జ్ఞం వరేణ్యం చ ధీతత్వస్య ప్రచోదకమ్॥ ఇతి దేవశ
బ్దో దివ్ క్రీడాయామితి ధాతోర్నిష్పన్నః ప్రయుజ్యతే భగ
వతి. తథా చ శ్రుతయః. దివ్యో దేవ ఏకో నారాయణః,
విచామ దేవం భువనేశమీడ్యం, ఏష హి దేవః ప్రదిశోను స
ర్వాః పూర్వో హి జాతస్స ఉగర్భే అంతః, తమః పరే దేవ
ఏకీభవతీత్యాదయః. సవితృపదం జగతాం స్రష్టృత్వా
దినా అర్థేన విష్ణోరేవ వాచకం. యతో వా ఇమానీత్యా

దిశ్రూయతే హేత్వంతరమాహ. శ్రుత్యర్థీత్యాది కాలే వే
దోచ్చారణాద్వా. ఆదిరుపలక్షణం అంతే చేత్యర్థః. హ
రిరితి కథనప్రసిద్ధేః సప్రవతత్ప్రతిపాద్యః. ఓంతత్సదితి ని
ర్దేశో బ్రహ్మణస్త్రివిధస్స్మృతః ఇతి గీతాసు. వేదాన్తగా
ణేయావంతిపఠితాని ద్విజోత్తమైః । తావంతి హరినామా
నికీర్తితాని న సంశయః ॥ వేదే రామాయణ ఇత్యాది. ఏ
వముదాధప్రథిమనివిష్ణుపారమ్యే గాయత్రీమధ్యభర్గశ్శ
బ్దాత్కేషాంచిదాపాతరసికానాం విప్రతిపత్తిర్జాయ
తే. అతస్తాం సమాధత్తే. భర్గ ఇతి భర్గశ్శబ్దస్సకారాంత
స్సూర్యాంతర్యామివిష్ణుతేజోవాచీ. ధ్యేయస్సదా సవితృ
మండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః ఇ
తి ప్రసిద్ధేః. భర్గస్తదాఖ్యం భజనీయ్యమేవం ధ్యాయామి
నిత్యం రవిమండలస్థం ఇతి నిరుక్తం సావిత్రీభాష్యే చ. య
ద్వా పాపస్య భర్జనాద్భర్గ ఇత్యుచ్యతే. తపసా బ్రహ్మ
విజిజ్ఞాసస్వేతి శ్రుతిః, అథవా తస్మిన్యదంతస్తదుపాసిత
వ్యం ఇత్యుక్తరీత్యా తద్భర్గః భగం కల్యాణగుణ జాతం
రేఫోఽధికగృహీతో నిరర్థకః విభక్త్యర్థేఽవ్యయః. త
థా యజుషి. అపస్సిషాసంత్సువరప్రతీత్త ఇతి. అప్రతి
పూర్వస్యేణో హిందంరూపం అప్రతీత ఇత్యస్మిన్నర్థే
అంతతకారద్విత్వమధికం. అథ ప్రాగుక్తహరిశబ్దసాహ
చర్యాపరావృత్తప్రణవశబ్దవాచ్యత్వమాహ పురస్తాదితి-
వైదికవిషయేషు పురస్తాదోంకారస్యాఖ్యేయత్వాత్. య

ద్వా ఓంకారేణాఖ్యేయభావా ద్వాచ్యత్వాత్. ప్రణవ
స్య బ్రహ్మ ఋషిః-గాయత్రీఛందః. పరమాత్మా దేవతా-
తత్ప్రీత్యర్థే వినియోగః అయంమంత్రః సర్వలోకవేద
వ్యాహృతికారణత్వేన బహ్వృచబ్రాహ్మణే ప్రజాపతిర
కామయతేత్యారభ్య మధ్యేతానిశుక్రాణ్యభ్యతపత్ తే
భ్యోభితప్తేభ్యస్త్రయోవర్ణా అజాయంత అకారఉకా
రమకార ఇతి తానేకధాసమభవత్తదేతదోమితి. అవర
క్షణఇతి ధాతోరశ్చతుర్థ్యంతః. ఉఇత్యేవధారణార్థ
మవ్యయం. మనజ్ఞానఇత్యస్మాద్ధాతోర్మః క్షేత్రజ్ఞో జ్ఞాతా
త్రయాణాం. సంహితాయాంప్రకారత్వం. అస్యాయం
పిండితార్థః. సర్వోప్యాత్మవర్గో నారాయణార్థః. న
తుస్వార్థః. ప్రకృతిత్వంచ మాల్యాలంకారవద్భోగ్యభో
గోపకరణభోగస్థానతయా తదర్థమేవేతి చేతనాచేత
నేషు భగవచ్ఛేషత్వేన నకశ్చిద్వశేషఇతి. తథాచోక్తమ
ష్టశ్లోక్యాం- అకారార్థో విష్ణుర్జగదుదయరక్షాప్రళ
యకృన్మకారార్థో జీవఇతి. యద్వా అష్టాక్షరేషుపుర
స్తాన్నిసర్గప్రణవస్యాఖ్యేయత్వాత్. ఓమిత్యగ్రేవ్యా
హరేత్, నమఇతి పశ్చాత్, నారాయణాయేత్యుపరి
ష్టాత్ ఇతిశ్రూయతే. ఏతేననమసా నమోవిష్ణవేబృహ
తే కరోమీత్యాద్యుక్తనమశ్శేషిత్వేనశ్రుత్యనుక్తవినతిస్తు
కథం నమస్య ఇతిహారదత్తవచనం నిరస్తంవేదితవ్యం. అ
న్యేతు- అకారేణోచ్యతే విష్ణురుకారేణరమోచ్యతే। మ

కారస్తుతయోర్దాససఇతిప్రణవలక్షణం ఇతికథయంతి-త
దుపబృంహణత్వేనవాల్మీకిరపి - అగ్రతఃప్రయయౌరామ
స్సీతామధ్యే సుమధ్యమా । పృష్ఠతస్తుధనుష్పాణిర్లక్ష్మ
ణోనుజగామహేతి రామగతింవర్ణయన్ ప్రణవార్థ
మసూచయదిత్యలంవిస్తరేణ. అపిచ అవననిజగుణాత్
అవనేరక్షణే నిజాత్స్వాభావికాత్ గుణాత్ గుణజా
తాత్ ఏకవచనమతంత్రం గుణ్యంతఇతివ్యుత్పత్త్యాగుణాః
జ్ఞానశక్తిబలైశ్వర్యసౌశీల్యాదయః స్వాభావికీజ్ఞానబల
క్రియా చేత్యామ్నాతాః తైరిత్యర్థః. క్రియారక్షణక్రి
యా- యద్వాఅవనేనిజాత్స్వతంత్రాజ్జగదవనగుణాత్-
అనేనబ్రహ్మరుద్రయోస్సృష్టిసంహర్తృత్వేతదధీ
నేఇతిద్యోత్యతే. తథాబ్రహ్మణోవచనం - సృజామిత
న్నియుక్తోహంహరోహరతితద్వశః ఇతి. అథాస్యైవా
పన్నిస్తారకత్వరూపావనగుణాత్ - పురాబదరికాశ్రమే
రణాయప్రవృత్తోనరసఖేన నారాయణేనసంజిహీర్షితో
రుద్రః పితుః పుత్రస్యచమధ్యం ప్రవిష్టేన చతుర్ముఖేన
బోధితశ్శరణాగతస్సర్వలోకశరణ్యేన రక్షితఇతిభారత
కథా. ప్రసాదయామాస భవోదేవంనారాయణంప్ర
భుం ఇత్యాదినాప్రవృత్తాత్రానుసంధేయా. శుద్ధసత్వా
శ్రయత్వాత్ శుద్ధసత్వమచిద్ద్రవ్యభేదః స్వసత్తాభాస
కం సత్వం గుణసత్వాద్విలక్షణం.అత్రాస్మదుక్తంపద్యం-
ద్రవ్యంషడ్వైవకాలః ప్రకృతిరపి జడౌతావుభౌ ధర్మ

భూతజ్ఞానంతచ్ఛుద్ధసత్వంత్వ జడమపి పరాక్ప్రత్య గీశ శ్చజీవః। అద్రవ్యంచాపిశబ్దాదికమథచగుణా శ్శక్తినం యోగయుగ్మం శ్రీభాష్యాదావ మేయేవిశదమకథయచ్ఛ ప్రమాణం యతీంద్రఃఇతి. పరమసత్వపంచశక్తిమయవి గ్రహఇతి- నిత్యం అమిశ్రసత్వాశ్రయత్వాద్వా, తథా శుద్ధశ్చాసౌసత్వా శ్రయశ్చేతికర్మధారయః, ఉభయ ధానత్వాశ్రయత్వంశ్రుతిస్మృతిభగవచ్ఛాస్త్రాదిషుసిద్ధం॥

శ్లో ॥ ప్రఖ్యాతాశేషదేవ ప్రణమనవిషయత్వా
త్తపోయజ్ఞకర్మస్తోమన్యాసాధికత్వప్రశమప
టిమవద్దివ్యనామస్మృతిత్వాత్। బ్రహ్మణ్యత్వా
గ్గిరీశాహుతి విధిషుజలస్పర్శనాద్విష్ణు పాదా
మ్భోజాతామ్భోధరత్వాదపినపశుపతిర్విష్ణురే
వప్రకృష్టః॥ ... ... ... ౨

వ్యా ॥ ప్రఖ్యాతేతి ॥ కించప్రఖ్యాతాశేషదేవప్ర ణమనవిషయత్వాత్ ప్రఖ్యాతా అశేషాయేదేవాః బ్ర హ్మరుద్రాదయః తేషాంయత్ప్రణమనం నమస్కారః తద్విషయత్వాత్ - సర్వదేవనమస్కారః కేశవంప్రతి గచ్ఛతి ॥ శృణుత్వంహివరారోహేయథానిత్యంనమా మ్యహం ॥ బ్రహ్మాద్యామునయశ్చైవ తపోవిద్యాసమా ధిభిః।అర్చయంతి సదాయంవైసదాపశ్యంతిసూరయః॥ బోధాయనివ్యే - బ్రహ్మేశేంద్రాది దేవానాందేవో నారాయణఃపరః ఇతి. తపాంసిచయజ్ఞాశ్చ కర్మాణిచ

